ఓమ్

# గ్రంథప్రకాశకునకు దీవన

శ్రీమాత! నీ తత్త్వ మామూల మెఱిఁగించి
కన్నుఁత విప్పవే కమలనయన!
గ్రంథిభేదనశక్తి గలిగించి సత్కృపన్
సాహం సమాధిభాగ్యమ్ము నిమ్ము;
అంజనభూత బ్రహ్మజ్ఞాన మిడి, పాపు
మావిద్యకాంధ్యదుష్టామయమ్ము;
నేత్రిపాటను జీవయాత్రాసుఖంబు నీ
చేతనుండుట నదే యూఁతయిమ్ము;

యజననిష్పన్నమౌ ధన మమిత మిచ్చి
శ్రేష్ఠిగాఁజేసి సతము నా శ్రేష్ఠ సుతున
కాయురారోగ్య భోగభాగ్యమ్ము లిచ్చి
యన్వయకరునిఁ జేయుమా యాదరించి ॥

—శ్రీ శ్రీయానందనాథుఁడు.

శ్రీ మాత్రే నమః

# అభిజ్ఞుల అభిప్రాయములు

లక్ష్మీప్రదానసమయే నవవిద్రుమాభాం
విద్యాప్రదానసమయే శరదిందుశుభ్రాం।
విద్వేషివర్గహననే చ తమాలనీలాం
దేవీం త్రిలోకజననీం శరణం ప్రపద్యే॥

శ్రీ శ్రీయానందనాథ పీఠనామధేయులు, బ్రహ్మశ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారు నాయందైన ప్రేమముతోఁ దమ వ్రాసిన ప్రత్యేకకృతిని నాకుఁబంపుచుంటయు, నేనది సద్యమేఁ జదివి యానందించి యేవో మాటలు వ్రాసి పంపుటయు నాచారమై పోయినది. శ్రీ శర్మగారు జగమెఱిఁగిన బాపనయ్య. శ్రీవారి సౌందర్యలహరి దేవీపంచస్తవీ మహాసారమంత్రపాఠాద్యనువాదములు, స్వతంత్రరచనములైన 'అమ్మతో ముచ్చటలు' శ్రీ సూక్తరహస్యార్థదీపిక, బాలాంబాభేమేశ్వరనుతిశతకములు మున్నగునవి యంధ్రమునఁగవిపండితసాధికాదృతములై, వారి యధ్యాత్మికానుభవమును, అనువాదసామర్థ్యమును, కవితాధీ పటిమములను నలుమూలలఁజాటినవి.

ఈ శ్రీదేవీసూక్తము ఋగ్వేదసంహితాభాగమందలి యెనిమిది ఋక్కులతోనైనది. దేవతలెల్లరు శ్రీదేవీసమ్ముఖమునఁజేరి ప్రార్థింపఁగా స్వమహిమము నాయమ్మయే వాగ్దేవీ రూపయై దేవతలకు బోధించినది గాన దీనికి శ్రీదేవీసూక్తమని వ్యవహారము. ఇటులే రాత్రిసూక్తమనునది, రాత్ర్యధిష్ఠానదేవతాప్రతిపాదకమై యథర్వవేదమందలి యెనిమిది ఋక్కులతోనైనది యొకటి కలదు. ఈ రెండును జండీసప్తశతీపాఠమునకంగములుగాఁ గైకొనఁబడినది.

చండీపాఠమునకంగస్తోత్రకల్పనముందు భిన్నభిన్నతంత్రములందు భిన్న భిన్న రీతులు గలవు. కొన్నింట దేవీసూక్తము పూర్వాంగములం దలిదిగాను, రాత్రిసూక్తము ఉత్తరాంగములందలిదిగాను, మఱి దీనికి వ్యత్యస్తముగాను గానంబడుచున్నది. ఎటులైనను దేవీసూక్తము చండీస్తోత్రమునకుం బ్రాణమువంటిదే. ఇంక వేదాధ్యయనానభ్యాసులు త్రికపద్ధతిని పాఠము చేయునపుడు ప్రథమచరిత్రమందలి మొదటియధ్యాయమునంగల రాత్రిదేవతాక స్తుతినే రాత్రిసూక్తప్రతినిధిగాను, తృతీయచరిత్రమందలి ప్రథమాధ్యాయమునంగల దేవీస్తుతిరూపశ్లోకములనే దేవీసూక్త ప్రతినిధిగాను గైకొనుచున్నారు.

శ్రీశర్మగారు గ్రంథాదిని ‘నేనెవరు’ అను శీర్షికతో వ్రాసిన విషయమును మంచి విమర్శదృష్టితోం జదివినపుడు యీ సూక్తమందలి యాధ్యాత్మికరహస్యభావముల నెఱుంగుటకుం బాఠకులకెంతో చేయూంత యనక తప్పదు. ఈ ప్రకరణమందే శ్రీదేవీ సూక్తశబ్దనిర్వచనప్రయోగవిశేషములు, గాయత్రీమహిమాదులు చొప్పించి సమన్వయించిన వీరి ధీపటిమ శ్లాఘ్యమనుటతిశయోక్తి కాదు.

శ్రీ శర్మగారు దేవీసూక్తవివరణములో మొదట వేద ఋక్కును, పిదప విద్యారణ్యభాష్యానుసారముగా దానితాత్పర్యమును వ్రాసి, యాపైని స్వబుద్ధికుశలతతో నాత్మానుభవమును జోడించి సాధకసుబోధముగా సోదాహరణముగ వ్రాసినది నిజముగం బరమార్థవివరణమే యనిపించి సాధకలోకమునకు ఆత్మానుసంధానప్రయత్నమున మార్గదర్శియై యుపకరించునని నా విశ్వాసము.

తొలి ఋక్కునందు రుద్రవసుఆదిత్యవిశ్వేదేవముఖ్యశబ్ద నిర్వచనమును బ్రహ్మశక్తిరూపాత్మతత్త్వమును చక్కగా వివరింపబడినవి.

పంచమఋగ్వివరణమున "ఉన్నతి" యను దాని విశేష మును, పశ్యంతీమధ్యమావైఖరుల స్థానభావములు, కులశబ్ద నిర్వచనము, మంత్రవర్ణ బీజసమర్థనము మున్నగువాని వివరణము గ్రంథకర్త్రువిశేషానుభూతినే వివరించును.

ఇటులే యూఱవ ఋక్కునందుగోశవివరణము మున్నగు పలువిషయములు సాధకసుబోధకముగా వ్రాసిరి.

నిజముగాఁజండీపాఠానురాగులకిది ప్రాణశక్తిధారకము. ఇట్టి వివరణమును జదువక, ఆత్మతత్త్వము నెఱుంగక, అర్థాను సంధానము లేక చేయఁబడు చండీస్తోత్రమె కాదు; ఏదియైనను ఆశానురూపఫలమునీయ లేదు. చండీస్తోత్రమునకుఁబ్రాణమువంటి దైన యీసూక్తవివరణమును సాధకలోకమునకిచ్చిన శ్రీశర్మ గారికి మేమెల్లరము కృతజ్ఞులము.

శ్రీవారు వ్రాసిన "మర్గాసప్తశతీసర్వస్వవివరణమును" "సత్య – నారాయణ – శర్మ – సాధనము" అను తేటతెనుఁగు రతనాల మూటయుఁబయల్పడియెనా – శాక్తాద్వైతులకే గాక, ఆధ్యాత్మికసాధకులకెల్లరకు మార్గదర్శకజ్యోతులై యొప్పునని యాశించుచున్నాము.

ఈ గ్రంథమందలి రెండవ భాగమైన "సోఽహంభావ సమాధి"ని గూర్చి రెండు మాటలు. ఇది శ్రీశర్మగారి ప్రియ శిష్య యగు నొక యువతి ప్రశ్నమునకు సమాధానరూపమైనను,

ఆ స్తికోపాసకసాధకబృందమునకు బహూపకారి. సమాధ్యవస్థ యన నేమో తెల్పి, దాని యెడ సాధకులొందు భ్రమప్రమాదములెట్టివో వివరించిన వీరి సిద్ధహస్తము ఆరురుక్షువులకవలంబ మని నమ్ముచున్నాను.

శ్రీశర్మగారిపుడు జనుల యవగాహనసామర్థ్యమును గుర్తించియే కాఁబోలును, పద్యాత్మకానువాదములను మాని తేటతెనుఁగున గద్యాత్మకవివరణములను లోకమునకిచ్చుచున్నారు. ఇది మెచ్చఁదగినది.

ఇందు ముఖ్యముగా యమనియమాదియోగాంగనిర్వచనము, సమాధిశబ్దబోధము, ప్రత్యక్షానుభూతదృష్టాంతములతో సప్రమాణముగానొప్పుచున్నవి. సోహంపదమందలి, అస్మత్తచ్ఛబ్ద సంయోగసమన్వయము రమ్యము. వ్రాయఁబూనిన నెంతయో కలదు. నా గ్రంథశరీరము పెరుగునను భయమున విరమించుచున్నాను.

ఆధ్యాత్మికోన్నతియే మానవజాతీయతకలంకృతియని లోకకల్యాణము నెంచి రచనముఁ గొనర్చు శక్తి సడలనీయక శ్రీశర్మగారికి దీర్ఘాయురారోగ్యములనిచ్చి మనుచుఁగాతమని శ్రీ త్రిపురాంబను వేడుకొనుచున్నాను.

ఆరసవల్లి,
2—5—56.

విద్యాభాస్కర,
ఇ. వెంకటరామశర్మ.

శ్రీమాత్రే నమః

పూజ్యపాదులు శ్రీశ్రియానందనాథుల పాదములకు
నే॥ పే రాకృష్ణ శాస్త్రి కృత వందనశతము సమర్పితము.

ఒమరు ప్రేమతో నావినోదమునకై పంపిన శ్రీదేవీ సూక్తపరమార్థవివరణమును, సోఽహంభావసమాధివ్యాసమును ఆమూలాగ్రముగాఁజదివితిని పదిసారులు. తనివి తీఱదు. తాము గ్రంథవిషయకాభిప్రాయమును గోరకున్నను, నేను జిజ్ఞాసు మాత్రుఁడనే నైనను, శ్రీమాతృప్రేరణమున మీయీరచనములను గూర్చి కొన్ని మాటలు వ్రాసి పంపుచున్నాను. స్తవమో వాస్తవమో యన నమ్మయే ప్రమాణము.

కృతి లోకకల్యాణప్రయోజనమైనపుడు, నిర్దుష్టము నపూర్వ విషయభూషితము నైనపుడు, పఠనముతోనే పాఠకునిలో నొక యభిప్రాయమేర్పడుట సహజము. ముద్రితాకారమునొంది, పండితాభిప్రాయముఖములైన కృతులను విమర్శబుద్ధితోఁజదివి గ్రంథవస్తువమూల్యమై హృదయంగమమైనపుడును, సహృదయ సాత్త్వికులు గ్రంథకర్త కోరకున్నను పఠనజనితానందము పట్టలేక తమ యభిప్రాయములను వ్రాసి పంపుచుందురు. వానిని ప్రకాశింపఁజేయవలయునను నాస కాదు. గ్రంథకర్తకుఁదాము ఋణపడియున్నటులెంచి, యంతతో ఋణముక్తులయినటులెన్ని విధి నెఱవేర్చితిమని తృప్తినొందుదురు. కవి శపించునో యని కొందఱు కాతరంపడుచుందురు. నే నీతెగవాఁడను. గాన నామాటలు చదువుకొని యాశీర్వదింపుఁడు.

స్వామీ! సాంకర్యలహర్యనువాదములనన్నిటినో చూచితిని. మీరాది కన్నాకను కన్నుగలవారన్న పేరు. మీ "యమ్మకో ముచ్చటలు" కన్నగిపికట్టె, మీ "శ్రీసూక్త రహస్యార్థ వివరణ" ముఖంపజ్యోతియై పాఠకుల జారిని నిస్త మస్కము గావించి, సాధకులంకున్నత భూమికారోహణమం దూతయిచ్చునని యాధ్యాత్మిక సాధనపథమందున్నవారెందఱో యన్న మాట. మీ "శ్రీమన్నారాయణతి" పరిశీలన తత్త్వబోధచేయు నొజ్జమిన్న. శ్రీదేవీపంచ స్తవమ్యనువాదము శ్రీకాళిదాసుని హృదయమును బుడికిపుచ్చుకొని వెలిపెట్టినదని యనుశీలించి యనిన పండితులమాట నబద్ధమా? "నీవే నే"నని యమ్మచే ముమ్మాఱనిపించిన యాపమ్మహాశయుని మహాత్మ్యము బ్రహ్మోపాసన మహిమమును మీ తేటతెనుంగు చాటి చెప్పుచున్నది.

ఇపుడు తమరు పద్యరచనములను దగ్గించి గద్యరూప వివరణములను దేటతెల్లముగాఁజేయుచు, సాధకులయాధ్యాత్మిక చక్షురున్మీలనము చేయించు నంజనశలాకలను బోలిన కృతులను వెలయించుట మాదృశులకమూల్యోపకారము.

ఇపుడు తమరు పంపిన శ్రీదేవీసూక్తపరమార్థముం జూడకున్నచో, సాయనసిలకంఠకృతభాష్యములతోనే మాతృప్తి యాగి యుండెడిది. ఇపుడో, చండీపాఠాంగమైన దీని పరమార్థము నెఱింగికొని చండీతత్త్వబోధకు అధికారమింత యలవడినదని యలరుచున్నాను. అపూర్వభావములమ్మయే మీకందిచ్చినదన్నను, తద్రూపముగా నమ్మయే వెలువడినదన్నను నన్నెవ్వరు నేమియుననరు.

ఇక 'సోఽహంభావసమాధి' — ఇది సాధనరాజ్యమందంతర్నిలయవసతికధికారముగలవారికి స్వాగతపత్రము. సామాన్యముగా సాధకలోకమునకుం జరమఫలమైన సమాధ్యవస్థానుభవమును గూర్చిన భ్రమప్రమాదములను సోదాహరణముగాఁజూపి స్వానుభవముతో నిశ్చితాంశమును బోధించునిది యెందఱి మబ్బునో మాపగలది. లోకులను దెమలనీకున్న శ్రీవిద్యావిషయకాశంకలను దొలఁగించు నెన్నో సందర్భముల నీవివరణములందుఁజొప్పించి మాకెంతో మేలు చేసితిరి.

స్వతంత్రములైనను, అనువాదములైనను మీహృద్య పద్యరచనములు విద్వత్కవిశిరోధార్యములని తెనుఁగు మాగాణికిఁ దెలిసినదే; భాషాభివృద్ధికై కంకణము గట్టికొన్న మంత్రి పుంగవుల సత్సంకల్పము ఫలించి, తమయార్తునికిఁబూర్ణచంద్రోదయరసమువలె, నేఁడు సన్నగిల్లిపోయిన భాషాయోషాంగమును బోషించినప్పటిమాట, యేమైనాసరి, యంతదాఁక ముఖ్యముగా నిట్టియాధ్యాత్మికరచనములు గద్యమయములై వెలయుటనే వాని సాయముననే, భారతులు యథార్థభారతులై "యాత్మ భారతిశక్తిముందు, అణుశక్తి యెంత" యనఁగల మహాత్ములు మఱల మన భారతీయులందు వెలయఁగలరు. గానఁ దామిటుపై నిట్టి నిగూఢాధ్యాత్మికబోధరచనములనే యిట్టి తేటతెనుఁగున గద్యరూపముగానే చేయుచుఁబ్రచురించినచో, మాసిన గుడ్డల వంటివైన మాయట్టివారి మదులనంటిన మాలిన్యములను దొలఁచి రంజనయోగ్యములుగాఁజేయునని నా యాశ.

అమ్మ కృప జూఱగొన్న వారికందరాని యాధ్యాత్మిక రహస్యముండదనుటకన్న ముగ్ధుఁడనైన నేనేమియు ననలేను.

అంగమాత్రమైన యీదేవీసూక్తపరమార్థవివరణమును బట్టి చూడ, అంగియైన మీ శ్రీదుర్గాసప్తశతీపూర్ణవివరణము, చక్రవర్తి పేదలకు జూఱగొన నిచ్చిన యొక పెన్నిధిగా నుండఁగల దని తోఁచును. అందు మాకుం బాలు దొరికి మాదుర్గము లెన్నఁడు తొలఁగునని యాశించుచున్నాను.

శ్రీమాత ముద్దుబిడ్డలయి మాతృసేవ యెటులు చేయఁ దగునో యటులు చేయుచున్న మిమ్ము నీరుజులుగా మఱి డెబ్బది యేండ్లు మనిచి, మీచేతి కంచె యాఱకుండ, జాఱకుండఁ జూచి, తన చిత్రములను విచిత్రతరములుగ వెలయించు బలము నొడఁగూర్చుఁగాతమని వేడుకొందును.

హైస్కూలు పండితుఁడు,
నాయుడుపేట.
25—4—56.

మీ పాదరేణువు,
పి. కృష్ణశాస్త్రి.



ఓమ్

శ్రీమాత్రే నమః

"శ్రీగురుః సర్వకారణభూతా శక్తిః"

అవిద్యకాంధ్యభేషజ
దేవితత్త్వప్రవేశదీక్షాసంధా
నావితనిజశిష్యున్ శ్రీ
శ్రీవిద్యానందనాథు సేవింతునెదన్.

—: సాధకోద్బోధము :—

కూర్చితే, నీమనఃకుసుమమ్ము, శ్రీమాత
కిచ్చు పూదోయిట నెన్నఁడైన?
దొరలించితే, యశ్రులురల నీతల నొక్క-
సారి దేవీపాదసారసముల?
"మాతఃప్రసన్నోఽస్మి మాం శాధి" యంచు శ్రీ
గురురూపశక్తినిఁ గోరినావె?
ఎఱుఁగుదే, శ్రీమాతృహృదయరాజ్యమున నీ
వొక సారథివటంచు నొకపుడైన?
నిక్కమ్ముగాఁ గంటినే, మాతృవిశ్వరూ
పముఁ గాంచు రతి యొక పారియేని?
నమ్మి చేసితె, "శరణం వ్రజ మామేక"
మన్నట్టి తల్లిమాటెన్నఁడేని?
"కనుగొందు నీదు యోగక్షేమ మిట్టులైన"
నను నమ్మబాసలోఁ దరసికొంటె?
అర్జించుకొన్నావె, అమ్మయే వచ్చి ని
న్నాలింగనము చేయునంత చనవు?

ఏడ్చినావే, "తల్లి ! యెన్నాళులీయెడ
కన్నబిడ్డఁడ నేను గాన" యంచు?
ఇందులకనక నీవెప్పుడైన శ్రీమాతృ
హితధర్మమొం దాచరించినావె?
అభయవరదమాతృహస్తమ్ము లెపుడు సా
ర్థములౌనొ నీమదిఁ దలఁచినావొ?
ఈయలేదను నేడుపే కాని, తల్లి చి
త్తము ద్రవించెడి కీలు తలఁచినావె?
ఏదియును లేదు; మించలే దీసశర్మ
సూక్తములు, మాతృముఖనీరజోద్భవమధు
కణము, లవి క్రోలి జగదంబ కౌఁగిటఁ బడి
సాధకా ! మఱి రాకట సౌఖ్యపడుము.

---

శ్రీమాత్రే నమః

## మాతృస్నేహము (అమ్మ నెయ్యము)

"శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రాః"

అమ్మా ! యంచెలుఁగెత్తి నన్నుఁ బిలువుం♦డా తీయనౌ పిల్పు, క
ర్ణమ్ముల్ సోకిన నన్ను నే మఱచెదన్; ♦ మర్పించెదన్మిమ్ము నై
తమ్ముల్; శీతలసౌధసేకమున మీ ♦ తాపమ్ముఁ జల్లార్తు; ని
త్యమ్మై యొప్పఁగ మీకుఁ గూర్తుసమర♦త్వమ్మున్వినుండాత్మజుల్. 1
కన్నులవ్విచ్చి యొకసారి కనుఁ, డిఁకెంత
తడవు కన్మూసికొని యిట్లు దైన్యపడుట?
ఒక్క గడెయైన మిమ్ము నాయొడిని వీడ్చి
దింపఁబోనయ్య ! నా ముద్దుదినుసు మీరు. 2

బిడ్డలీరలు; నాయొసంగెఱుగు వారు;
ఉమ్మలిక లేదు; మఱి మీకు నడుకు లేదు;
పుట్టుసావులు మఱి లేవు; పొగులు లేదు;
క్రోలుఁడీ నెయ్యపుం జనుబాలు, రండు; 3

అమృతమయవస్తుసంతానమయ్యు మీర
లక్కటా! శిక్షణమనెడి గుహను,
బడి తెమలలేక యున్నారు; పరమదీను
లగుచు, దుఃస్వప్నపీడితు లార్తులునయి. 4

ఎడపెడ దెబ్బలై భువి జనించుట చచ్చుట వేఁచుచుండఁగా
నుడుగని రోగశోకముల యుమ్మలికమ్మది మర్మభేదియై
కడుఁగడుఁగక్కసింప, సుడిగ ర్తమునంబడి, వేడి యూరుపుల్
వెడలఁగ వేగనేల? యిటు నే నటులుండిదె నన్నుఁజూడుఁడీ. 5

కనుఁడు మీకయి దివి పట్నమ్ము తెఱచి
యుంచితిని; నా యనంత బాహువులు సాచి
యుంచితిని, మిమ్ముఁజేకొని యూరడింప;
తడవు చేసినచో నమృతమ్మె విసము. 6

సత్యవస్తువిజయభేరి సద్దు వినరె?
సత్యలోకామలజ్యోతి సకలదిశల
వెల్గగనరాదె? మీతల్లి పిల్పులకును
నభము మాఱ్ఱోగు నదియు వినఁబడ లేదొ? 7

సత్యసంబోధనస్వనశ్రవణమునను
గడలి చెలియలి గట్టును గడచు నదిగొ;
ప్రాణమయసత్యము పిలిచినంత వసుధ
సాజమా జడ్డు వాసి యుత్సాహమందు. 8

ఉరవడింగొని వాయుపు కెరలి కెరలి
వీచు నాసత్యనినదము వినిమె చుండి:
ఆపవిత్రప్రణవనాద మంతరిక్ష
మెల్లనిండెను వెలితిలే కిదిగొ వినుడు. 9

కల్లచీఁకటి మీకనుల్గప్పె, నింత
దాఁక దిగ్భ్రమమునఁగడు దైన్యమొంది,
యలసి నిదురించుచున్నారె? యక్కటకట!
కొడుకులారా! వడిగ మేలుకొండు లెండు. 10

మీ మొగములిటు త్రిప్పుఁడు; మిమ్ముఁజూచి
యుగములై పోయె; మిమ్ము నా యొడిని నిల్పు
కోర్కి తీర్పుఁడు; మఱిమఱి కోరనయ్య!
రండు; మీ యమ్మ యొడిని గూర్చుండుఁడయ్య! 11

చిత్తమారఁగ నమృతసంజీవనాంబు
ధారలన్నిమ్ము నాడింతుఁదనయులార!
శాంతిసుఖముల పేరిటి స్వచ్ఛజలము
లందుఁదోఁగఁగ వచ్చు మీయంత నంత. 12

అమ్మ యొడిలోన మీరు నిత్యమ్ము నుండు
టదియె బ్రాహ్మీస్థితి యను సత్యమ్ము నెఱిఁగి
యా మహాలాభమంది మీరమరులరయి
చెలఁగఁజూడరె? యిప్పుడైనఁదెలిసినదఁటె. 13

సర్వకారణభూతయా శక్తి యనెడి
శ్రీగురుశుభాశిషామృతవృష్టి మీదు
తలలపైఁజల్లఁగా నిరంతరము కురిసి
ధన్యులౌదురు గాక నాతనయులార! 14





శ్రీమాత్రే నమః

# శ్రీదేవీసూక్త పరమార్థవివరణము



## "నేనెవరు?"

అమ్భృణుండను మహర్షి కూంతురు "వాక్" అను నామె బ్రహ్మవిదుషి; (ఋషిక) గాన నామెయు ఋషియే. ఆయమ్మ సచ్చిదానందరూపపరమాత్మతోం దాదాత్మ్యము (సంపూర్ణాభిన్నత) నొంది యేమాటలతో నాత్మస్వరూపము వెల్లడించెనో, యాగ్రంథమే దేవీసూక్తము పేర వెలయుచున్నది. ఋగ్వేదమందలిది. ఇందలి మంత్రము లెనిమిది.

ఈ దేవీసూక్తమె శ్రీచండీస్తోత్ర (దేవీమాహాత్మ్యము) పాఠమునకుం బునాది తెలివి. చండీపాఠమనునది దీని చక్కని విస్తారవివరణమే.

దేవీసూక్తమను నీవేదభాగము భ్రమప్రమాదములు లేని యాప్తకామయైన ఋషిక యనుభవమే; గాన నిది యపౌరుషము. చండీపాఠమందలి పదరాశి యొక మహర్షి నోర వెడలినను, ఆశబ్దరాశి యేజ్ఞానమును, నేభావములను వెల్లడించెనో యవి నిత్యములు, అపౌరుషములు.

దేవీసూక్తము — స్వయంప్రకాశయు, క్రీడనశీల యునౌ (సృష్టిస్థితిలయతిరోధానానుగ్రహములనెడి పంచకృత్యములే క్రీడలు) పరాశక్తిని (మహామాయను) గూర్చిన సూక్తము. సూక్తమనంగా, స్వానుభవమున నిస్సంశయముగాం బలికిన

విషయము. సూ + ఉక్తము = తల్లింగూర్చిన పలుకు. శ్రీ + దేవీ + సూక్తము = శవర్ణము ఆనందవాచి. రేఫము తేజో(జ్ఞాన)వాచి; ఈ = బ్రహ్మశక్తి; కాఁగా జ్ఞానానంద స్వరూపయు, స్వయంప్రకాశశీలయు, క్రీడనశీలయు నైన తల్లిని (జగన్మాతను) గూర్చి స్వానుభవముతో నిస్సంశయముగాఁ జెప్పఁబడినది. అనఁగా మహాలక్ష్మి పేర వెలయు మహామాయను గూర్చి నిస్సంశయముగా స్వానుభవముతోఁ జెప్పఁబడిన గ్రంథము.

శ్రీ పదమునకు జ్ఞానానందస్వరూపబ్రహ్మమనియే యర్థము. మాతృభావముతో నుపాసింపఁబడు బ్రహ్మవస్తువే మాయ — యనఁగా బ్రహ్మశక్తి. మహామాయ సర్వోత్కృష్ట బ్రహ్మశక్తి. శక్తిశక్తిమంతుల కభేదమనుట శ్రుతిప్రతిపాదితము. బ్రహ్మవస్తువు స్త్రీ గాదు పురుషుఁడునుగాదు. అది "యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత। అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్" అను గీతలందలి ప్రతిజ్ఞావాక్యాను సారముగా స్త్రీ గానో పురుషుఁడు గానో, అవసరమునుబట్టి, యేశరీరముతోనో ధర్మసంస్థాపనార్థ ముదయించుటే యవతారము. అవతారమూర్తులు స్తుతింపఁబడి యర్చింపఁబడు చుండును. భగవద్విషయమున నిది మన దేశమున వింత కాదు. పురాణములందెల్లెడ నివియే ముచ్చటలు. అయినను "ఇతిహాస పురాణాభ్యాం పరమార్థః ప్రకాశ్యతే" అను సూక్తిని బట్టి భగవదవతారకథాసందర్భములందెల్ల నిమిడియున్న పరమార్థ విషయములను బయల్పెట్టుటకు మనము ప్రయత్నించిన యపుడే, భగవద్విభూతివిశిష్టులై నారాయణావతారముగాఁ బూజింపఁబడు వ్యాసులను మనమును బూజించినట్లగును; మనకుఁబురాణపఠనఫలము నపుడే చేకూరును. ఉండనిండు.

ఋషి నోర వెల్వడు శబ్దరాశి ప్రకాశింపఁజేయు జ్ఞాన భావము లపౌరుషములంటిని. అన్ని కాలములందు నన్ని తెగల కుంజెందిన సాధకమహాపురుషుల హృదయములందాజ్ఞానమే, ఆభావమే యభివ్యక్తమగుచుండును. దేశము: కాలము, వస్తువు, భాషయను వానియందలి విభిన్నతయే (వేఱుపాటే) కారణముగా, అపౌరుషములయిన యాజ్ఞానభావములను దెలుపు పలుకులందు మాత్రము విభిన్నత కానవచ్చుచుగాని, విషయ మందుఁగాదు.

శ్రీదేవీసూక్తమందలి ప్రతిపాద్యవిషయము (నిశ్చయ జ్ఞానముతో నెలకొల్పఁదగినది) సచ్చిదానందస్వరూపపరమాత్మ. దేవీమాహాత్మ్యమందీపరమాత్మయే మహామాయాస్వరూప ముతో, నుపాఖ్యానాకారముతోఁ జక్కఁగా వర్ణింపఁబడినది. పరమాత్మయు మహామాయయు నభిన్నులు.

తర్కశాస్త్రమూలకవిచారముచేతను, మాఖికా లోచనముచేతను గొందఱు, మాయ నాత్మకంటెను వేఱుగాఁబలుకుదురు; అయినను బ్రహ్మనిష్ఠులైన సాధకపురుషులు కాళిదాస-గౌడపాద-శంకరాచార్యాదులు వేదావిరుద్ధముగా మాయాబ్రహ్మములు కేవలమభిన్నములనియే తెలిసికొని తెలిపిరి. ఎంతదాఁక సాధనముండునో, ఎంతదాఁక దేహముండునో, యంతదాఁక నాత్మ మాయారూపముననే యభివ్యక్తమగుచుండును.

ఎపుడు పరమాత్మ తెలియఁబడునో యపుడు సాధ్యము లేదు; సాధకుఁడు లేఁడు; సాధనము లేదు; చింతనము లేదు; భాషయు లేదు; భాషయుఁజింతయు సాధనముతోడనే వచ్చుటచే ఆత్మ మాయారూపమునఁ బ్రకటితమగుచుండును. గానఁబర

మాత్మయే దేవీమాహాత్మ్యమందు (చండీపాఠమందు) ప్రతిపాద్య విషయమగుటచే, అదయే మహామాయగా నభివర్ణితమైనది. ఈశబలతత్త్వము దేవీమాహాత్మ్యమందాడాడ విశదమగుచునే యుండును.

ధర్మశాస్త్రములందన్నింటను ప్రధానలక్ష్యము పరమాత్మజ్ఞానమే. ఆత్మవస్తువు, జాతివర్ణసంప్రదాయములను వానిని గూడి, లెక్కలేని భిన్నరూపములందును సర్వజీవులందును సమానముగాఁగానవచ్చుచున్నది. జీవుఁడీ తన రూపము నెఱుంగుటకే ప్రయాసపడుచుండును.

ఎంతదాఁక దీని నెఱుంగ లేఁడో యంతదాఁక నతఁడు సాధారణజీవమాత్రుఁడే. ఎప్పుడీ జీవుఁడాత్మానుసంధానమును ప్రత్యక్షము చేసికొనఁ (తానెవ్వఁడో తెలిసికొన = బ్రహ్మసాక్షాత్కారముచేసికొన) గల్గుచున్నాఁడో యపుడే వానికి, సాధకుఁడు భక్తుఁడు ననుపేళ్లు పెట్టుచున్నదీ లోకము.

ఎప్పుడు మనుష్యుఁడాత్మవస్తువు వంకనే నడుచుట నను భవింపఁగల్గుచున్నాఁడో, యపుడే వానియందు గానవచ్చు బాహ్యలక్షణములనే సాధనము, నివృత్తిమార్గము నందురు. ఆలక్షణములే శాస్త్రమందు విధినిషేధరూపముగా వర్ణింపఁబడినది. వాస్తవముగాఁగర్మము సాధనము; జీవుఁడు సాధకుఁడు; ఆత్మస్వరూపానుభవమే సాధ్యము. ఆత్మభావము లేని సాధనము లెన్నియైనను బూర్ణ ఫలము నీయఁజాలవు. ఎంతదాఁక 'నేను' అను దాని కంటె, దేవత వేఱని యుపాసింపఁబడునో, యంతదాఁక వాస్తవముగా ఒక్క 'నేను' ఉపాసింపఁబడినపుడైనను, నేను దక్క నితరమేదియు నెచ్చటను లేదు గాన, అది విధిపూర్వక

మైన యనుష్ఠానము కాదు; గాన ముక్తిరూపమహాఫలము నీయఁజాలదు. సారాంశమేమనఁగా, ఆత్మభావరహితమైన సర్వసాధనములును అజ్ఞానముతోఁగూడినవే. ఇదె యద్వైతసాధనబోధము. మహావాక్యార్థసాధనబోధము.

ఇపుడిచట రెండు మాటలు చెప్పఁదగియున్నవి. ద్విజజాతులకుఁజననాఁడు జరుగు ప్రధానప్రథమసంస్కారము ఉపనయనము. ఇందుపాసింపఁదగిన బ్రహ్మవస్తువును గూర్చిన జ్ఞానము నిచ్చు 'గాయత్రి' యను మంత్రమే యుపదేశింపఁబడును. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అని యొత్తుబడి నపుంసకలింగపదముతోఁ జేయఁబడినను, ఉపాసనమందు బ్రహ్మమును మాతృబుద్ధితోఁగొల్చుటె శ్రేయస్కరమని విధించుచు, మొదటి స్థూలోపాసనమందు "ముక్తావిద్రుమహేమనీలధవళచ్ఛాయైర్ముఖైః" రిత్యాది శ్లోకరూపధ్యానమందు బ్రహ్మమునకు స్త్రీరూపకల్పనమునే చేసిరి. మఱియు సూక్ష్మోపాసనము (మంత్రజపరూపము) నందు నామంత్రమును గాయత్రీమంత్రమనిరి. "గాయంతం త్రాయత ఇతి గాయత్రీ" = తన్ను గానము చేయు వానిని గాపాడునది యనియు, "గాయం త్రాయత ఇతి గాయత్రీ" గాయమును = ప్రాణమును గాపాడునది, అనఁగా దీర్ఘాయురారోగ్యముల నిచ్చునది యనియు నర్థము. దీర్ఘాయురారోగ్యవంతుఁడై సాధకపురుషుఁడు బహుకాలము బ్రహ్మము నుపాసించుటయుఁగర్మక్షయము చేసికొనుటయు నను లాభముల నొందఁగల్గును. త్రాణము భయమువలననే కదా. భయమన నేది? "అథ తస్య భయం భవతి" అను శ్రుతినిబట్టి పునర్జన్మభయమే భయము. ఆభయత్రాణము జ్ఞానమూలకము.

"జ్ఞానాదేవ ముక్తిః" జ్ఞానమునొసంగి తన్మూలముగా ముక్తి నిచ్చునది గాన గాయత్రి. "వేదమాతా తు గాయత్రీ" యనుటచే, జ్ఞానమును బుట్టించునది యనియు; వేదమనంగా బ్రహ్మము; దానిని దెలియఁజెప్పునది యనియు, "వేద స్త్వం తపో బ్రహ్మ" యనుటచే, జపరూపతపస్సు నంగీకరించునది యనియు, అంగీకరించి జ్ఞానదానము చేసి ముక్తినిచ్చునది యనియు నర్థము. ఆ గాయత్రీనామకసంధ్యాదేవికి వందనము చేయుచో, దేవీ = స్వయంప్రకాశశీల, క్రీడనశీల యనియు, వరదా = కోర్కెల నిచ్చునది, భర్తగా భావింపఁబడు పరమాత్మ నిచ్చునది, (బ్రహ్మమును బొందించునది) శ్రేష్ఠమైన దానిని (ముక్తిని) ఇచ్చునది యనియు నర్థమిచ్చు చక్కని సార్థకపదములతోనే మనకు బోధించిరి. అంతేగాక "అక్షరం బ్రహ్మసమ్మితమ్" = నాశనరహితయు, బ్రహ్మముతో అధిష్ఠాన అనుష్ఠాన అవస్థాన నామరూపములందు సమాన యనియు బ్రహ్మశక్తుల యభిన్నతనే బోధించిరి. ఇచట నపుంసకలింగము ఛాందసము.

మఱియునట్టి బ్రహ్మమాయను గాయత్రి నుపాసించునపుడు వసిష్ఠభారద్వాజాదులు చేసిన బోధ చూడుఁడు.

"న భిన్నాం ప్రతిపద్యేత గాయత్రీం బ్రహ్మణా సహ ।
అహం బ్రహ్మేత్యుపాసీత విధినా యేన కేనచిత్ ॥

గాయత్రి, సంధ్య యను (చక్కఁగా ధ్యానింపఁబడునది; భ్రూఘ్రాణముల సంధియందు = ఆజ్ఞాచక్రమందు ధ్యానింపఁబడునది.) నామములనొప్పు బ్రహ్మశక్తిని బ్రహ్మముకంటె వేఱని తలఁపరాదు. అహం = నేను, బ్రహ్మేతి = బ్రహ్మమనే యని, ఉపాసీత = ఉపాసింపవలయును, అని శాసించుట బ్రహ్మ

మాయల కభేదమనియు, 'నేను' అనువాఁడు సత్యజ్ఞానానంద స్వరూపబ్రహ్మమని చెప్పి, నేను కాఁడనియుఁజేసిన గట్టి తత్త్వ బోధమే కదా. కావున నట్టి విస్పష్టబోధమును సార్థకపదములతోఁ జేసిన మంత్రద్రష్టలైన ఋషులు ప్రథమపూజ్యులు గనుకనే ప్రత్యేకమంత్రోపాసనాదులయందు బ్రహ్మ—విశ్వామిత్ర—వసిష్ఠ—వామదేవ—నారదాదులైన వారినే తొలుదొల్త శిరసా వహించుచు (శిరమున న్యసించుకొనుచు) గౌరవించుచున్నాము. ఈ దేవీసూక్తమందును అంభృణీ ఋషికే; వంద్య. ఈయుపన్యాసముచే ఆత్మభావసహితమైన సాధనమే శాస్త్రోక్తము, జ్ఞానసహితము, ఫలదము నని తెలియును.

మఱియొక్క విశేషము చదువరు లెఱుంగనిదికాదు. చిన్ననాఁడుపదేశింపఁబడిన యుపాసనారహస్యమునకు జ్ఞాపికగా నుండుటే కాక, ఇతరులను సంబోధించునపుడును "తత్త్వమసి" యను మహావాక్యార్థమును 'నేను, నేను' అని యెల్లపుడు ననుకొను 'నీవు' అనువాఁడవును ఆబ్రహ్మమవే కాని జీవమాత్రుఁడవై, కరచరణాదివిశిష్టమైన శరీరము నీవు కావు సుమా యని మాటిమాటికి నుద్బోధించుటకే పేరి ముందు శ్రీ, బ్రహ్మశ్రీ, రాజశ్రీ, మహారాజశ్రీ, శ్రీవేదమూర్తి యను గౌరవార్థకములను దగిల్చి పలుకు వ్రాయు నాచారము సనాతనము. లోకమందు వ్యవహారమునకై నీవిగ్రహమున కేసంజ్ఞ పెట్టినను "విగ్రహమందలి 'నీవు' జ్ఞానానందస్వరూపుఁడును, సర్వపరిపాలకుఁడునైన పరమాత్మయే సుమా" అని తెలుపుటకే. తొల్లింటి జ్ఞానసంపన్నులు లోకానుగ్రహబుద్ధితోఁజేసిన కట్టుబాటు, తత్త్వబోధకైన మర్యాదాని మేలు కదా.

పిలుపులందు సైతము జ్ఞానసంపత్తిని గాంచు భాగ్యము భారతులదే. "భాయాం రతాః భారతాః" తేజస్సునందాసక్తి గలవారలు భారతులు. బ్రహ్మభర్గస్సు నుపాసించు నాసక్తి మనకే సుప్రసిద్ధమనియు, అట్టి సార్థకనామమున కర్హులమైన మనమే ధన్యులమని సంతసించి గర్వింపనా? ఆ భారతి మన ద్విజ జాతులనుండియుందొలఁగి మనమే కోల్పోతిమని దుఃఖించి క్రుంగనా? గాయత్రీమంత్రమందలి భర్గశ్శబ్దమునకర్థ మీా తేజస్సే (బ్రహ్మశక్తి.)

"భేతి భాసయతే లోకాన్ రేతి రంజయతే జనాన్ ।
గ ఇత్యాగచ్ఛతేఽజస్రం భరగో భర్గ ఉచ్యతే ॥"

ఇట్టి తత్త్వబోధకసంబోధనము దేశాంతరులందు లేదని నేనన లేను. పాశ్చాత్యుల గౌరవసంబోధనము Sir = (A title of respect, used in addressing a man before using his name) సర్ అనునది శ్రీశబ్దవికారమే. ఆవంకకెగఁబ్రాకి, యిపుడు పాశ్చాత్యులనఁబడుచున్న యార్యసంతతివారలయందు సుప్రసిద్ధముగా మును వ్యవహారమందుండిన శ్రీశబ్దము తత్త్వ బోధక, మది కాలక్రమమున వారి నోళ్ల వికృతి నొందిన బహు సంస్కృతపదజాలముతోఁబాటు మాఱిన పలుకుబడితో 'సర్' అయినది. ఈ రహస్యార్థము వారును వారి భాషాపాండితిని గడించియు వివేకింపని మనలో ననేకులును నెఱుంగకున్నంబోయెఁ గాక. పూజ్యతమవస్తువు బ్రహ్మము. సచ్చిదానందస్వరూపము. ఆలక్షణమును బోధించు పదము శ్రీ. తత్త్వబోధకము కనకనే నామాదిని వారును గౌరవార్థకమని చేర్చుచున్నారు. ఇప్పటికే చాల దూరము పోయితిమి. ఇఁకఁబ్రకరణమునకు వత్తము.

మఱియు నాత్మానుసంధానముతోఁగూడిన యాహార విహారాదులైన కర్మనియమములు సైతము లౌకికములైనను, సాధనములనియే యన వచ్చును.

ఈ యాత్మయే నేను; నేను తల్లిని; నన్నెఱుంగుట — యనఁగాఁదల్లిని జేరి యాత్మసాక్షాత్కారము చేసికొనుటయును నిమ్మూడు మాటలకును నర్థమొక్కటే.

దేవీసూక్తమందు 'అహమ్' అను మాటచే నేయర్థము (ఏ తత్త్వము) తెల్పఁబడెనో, యదె చండీపాఠమునందు మహా మాయగా వర్ణింపఁబడినది. ఆ దేవీసూక్తమందు 'ఆత్మ' యన్నదే (నేను అన్నదే) చండీపాఠమునందు 'తల్లి'.

ఇందువలనఁజండీస్తోత్రపాఠమును కేవల శాక్తసాంప్రదాయపారాయణపుస్తకముగానే తలంచు వారికీమాట భయ విస్మయజనకము గానె తోఁచును. మహామాయ యమ్మాఱు మూడు రూపములతో (మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసర స్వతీ రూపములతో) నవతరించి చేసినది దేవశత్రుసంహారమే కావున నాచరిత్రములతో దేవిని స్తుతించు ఫలము శత్రు వినాశమే యనుచుఁదమ రాజకీయవ్యవహారములందు గెల్పును, శత్రూచ్చాటన వశీకరణ మారణాదులను గాంక్షించి స్తోత్ర పాఠము చేయువారునుంగలరు. అట్టి వారి భ్రాంతిని దొలఁగించి "స్వర్గాపవర్గదా దేవీ' యను స్తుతివాక్యము సార్థకముగా జ్ఞానదానము చేసి ముక్తినిచ్చుట పాఠఫలము చుండీ" యని తెలుపుటకే, "కరుణాసాగర మహామాయాదేవి; యట్టి లౌకిక వాంఛాఫలము నిచ్చినను పరమపురుషార్థప్రదానమునకై కంక ణము గట్టుకొన్న యభయహస్తచుఁడీ" యని చెప్పుటకే

చండీస్తోత్రపఠమునకుం ముందు, అనఁగా సాధనయుద్ధయత్న మునకుఁ ముందు, ఉద్యోగిపర్వమనఁబడు దేవీసూక్తము పేరి మాతృస్నేహమును, అర్గల యను పేరి మాత్రభిముఖగమన మును, కీలకమను పేరి యధికారనిర్ణయమును, కవచమను పేరి మాత్రనుభూతిని విధిగాఁజేయక చండీపాఠము చేయుట వ్యర్థ మని ఋషులు శాసించిరి. గాన లౌకికఫలప్రదమే యిది యను వారి భ్రాంతిని దొలంచుటకే యింతగా వివరించి తత్త్వబోధకుఁ గడంగుట. అందు దేవీసూక్తము ముఖ్యతమము. జీవునకుఁ దెలిసియో తెలియకో, యేది యభీష్టవస్తువో, దాని ప్రకృత స్వరూపసంబంధమందు, ఏదో యొక విధమైన స్థూలజ్ఞానము అత్యంతావశ్యకము, కానిచో నభీష్టమునొందు దారి, కడు నిడుపై పోవును, గాన శ్రీదేవీసూక్తపరమార్థము నెఱుం గకయే చండీతత్త్వమందుఁబ్రవేశించుట నిషేధింపఁబడినది.

లోకమందు సాధకులనేకులు విఫలమనోరథులగుట చూచుచున్నారము. దాని కొక్కటే కారణము. ఉద్దేశ్యము (గుఱింపఁదగినది) లేక పోవుటయు, ఉపాసనవిధులను గుప్త ముగాఁదెల్పిన మహర్షుల హృదయము నెఱుంగకయు శ్రమ పడుటే.

భగవత్స్వరూపము తెలియఁబడక — ఆత్మ సాక్షా త్కారము నొందక, "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అను నుపదేశమందుఁదొల్త 'ద్రష్టవ్య' పదముండుటను గమనింపక, సాధనమార్గమందు ముందంజ వేయుచు ననేకవిఘ్నములకు సాధకలోకము పాల్పడుట యందు వింతేమున్నది?

సరే, కానిండు; సాధకులారా! ఇపుడు మనము తొలు దొల్తఁదల్లిస్వరూపము నెట్టిలో యెఱుంగుటకై దేవీసూక్త మును శరణు జొత్తము.

కొన్నితంత్రములందు దేవీమాహాత్మ్యస్తోత్రమున కీ సూక్తము పూర్వాంగము గాను, గొన్నింట నుత్తరాంగము గాను గానవచ్చు నైనను, దేవీతత్త్వమును దేవీమాహాత్మ్య గ్రంథహృదయము నెఱింగికొని స్తోత్రజపమునకుఁగడంగుటయే శ్రేయస్కరమని తోఁచి, పూర్వాంగముగానే యెంచి వ్రాయు చున్నాను. అమ్మకరుణ యూఁత.





# శ్రీ దేవీ సూక్తము

## (పరమార్థవివరణము)



అహం రుద్రేభిరిత్యష్టర్చస్య సూక్తస్య అమ్భృణీ వాగృషిః; బ్రహ్మరూపా మహాలక్ష్మ్యభిన్నా సైవ దేవతా; త్రిష్టుప్ఛందః; ద్వితీయాయా ఋచో జగతీ; దేవీమాహాత్మ్య సంపుటీకరణోత్తరాంగత్వేన (పూర్వాంగత్వేన వా) జపే వినియోగః ॥

1. ఓం అహం రుద్రేభిర్వసుభిశ్చరామ్యహమాదిత్యైరుత విశ్వదేవైః। అహం మిత్రావరుణోభా బిభర్మ్యహమింద్రాగ్నీ అహమశ్వినోభా ॥

అథర్వశిరస్సునందు దేవీప్రతిపాదకమై చెప్పఁబడుటచే దీనికి దేవీసూక్తమను పేర వ్యవహారము.

అమ్భృణుఁడను ఋషి కూతురు "వాక్" అను పేరు గలది, బ్రహ్మవిదుషి. కావున నామెయె ఋషిక (మంత్రద్రష్ట్రి) సచ్చిత్సుఖాత్మికయై, జగత్కారణయై, మహాలక్ష్మ్యభిన్నయైన యామెయె దేవత. ఆబ్రహ్మముతోఁదాదాత్మ్యము ననుభవించుచున్నదై (సర్వజగద్రూపముతో సర్వాధిష్ఠానయైనది) నేనె సర్వము నగుచున్నానని యాత్మస్తుతి చేయుచున్నది.

నేను, ఏకాదశరుద్రులతోను, ద్వాదశాదిత్యులతోను, విశ్వదేవులతోను దాదాత్మ్యమునఁ (వారికంటెను వేఱు గాక) జరించుచున్నాను. మిత్రావరుణుల నిర్వూరను నేనె బ్రహ్మ

భూతనై ధరించుచున్నాను. ఇంద్రాగ్నులను నేనె ధరించుచున్నాను. అశ్వినీదేవతల నిరువురను నేనె ధరించుచున్నాను. నాయందే జగత్తంతయు ముత్తెపుంజిప్పయందు వెండివలె నధ్యస్తమై కానవచ్చుచున్నది. అనఁగా మాయయే (బ్రహ్మశక్తియే) జగదాకారముతో వివర్తించుచున్నదని భావము. అట్టి మాయ యాధారముగా నుండుటచేతనే, అసంగుఁడైనను బరమాత్మునకు సర్వోత్పత్తికారణత్వము చెప్పఁబడుచున్నది.

వివరణము:— అహమ్ = నేను; సచ్చిదానందస్వరూపాత్మను నేనె. సాధారణముగా 'నేను' అనఁగానే దేహాత్మబుద్ధి విశిష్టుఁడై, జననమరణధర్మము గలిగి సుఖదుఃఖములతోఁగూడి, సంసారజుష్టుఁడైన జీవమాత్రుఁడనియే తోఁచును. అయిన నించుక స్థిరముగా 'నేను' అను దాని స్వరూపానుసంధానము చేసి చూచుచో, మనము దాని మహోన్నతభావము నెఱుంగఁగలము.

సాధకపిపాసువులారా! రండు; ఇఁక మన యమ్మ చేయూఁతతో ముందునకుఁబోవుదము. చూడుఁడు; మనమెల్లరము 'నాదేహ' మనుచున్నాము. ఇది విచారించినచో, దేహము 'నేను' అను వానికిఁజెందిన వస్తువులలో నొకటి యనియు, 'నేను' దేహముకంటె వేఱనియుఁదోఁచును. నేను చూచుచున్నాను; ఇది నాదేహము; నాదేహము చిక్కినది; బలిసినది యనుచున్నాము. దేహము నేను గాను; దేహము నాది. ఇట్టులు మనము 'నేను' అనువానిని దేహముకంటె వేఱని రూఢిగాఁదెలియఁగలుగుచున్నారము. ఈవరుసనె ముందు

నకుఁబోయినచో 'నా ప్రాణము, నా మనస్సు, నా విజ్ఞానము, నా యానందము' అనియెకదా పలుకుచున్నాము. మనమది యెఱుఁగకే యనుచున్నారమా? కాదు, అటు కాదు; తెలిసియుఁ దెలిసికొనలేకయే యీభావము. ఎంత పరిహాసాస్పదము! తెలిసికొననంతకుఁ దెలియనే తెలియదు. ఇప్పుడు తెలిసికొనఁగూర్చుండుమేని నిజమెఱుంగఁగలము.

ఈ 'నేను' దేహముకంటెను, ప్రాణముకంటెను, మనస్సుకంటెను, విజ్ఞానముకంటెను, ఆనందముకంటెను వేఱురూపముగా ననుసంధానింపఁబడుచున్నది. అనఁగాఁ బంచకోశములకంటెను లోపలఁ బ్రకాశించు వస్తువుకంటె వేఱు కాదు. తాను నివసించు నింట నెవఁడును 'ఇల్లు నేను' అనుకొనలేఁడో, యట్లే 'నేను దేహమను, నేను మనస్సును, నేను బ్రాణమను' మున్నగు నిట్టి ప్రతీతి నేనాఁడు నెవ్వఁడును బొందఁడు. ఆయిల్లు కూలిపోయినపుడు నేను దుఃఖితుఁడను; ఇల్లు బాగున్నపుడు నేను సుఖియునై యెటులున్నానో, సరిగా నటులే, దేహమనఃప్రాణాదులతోడ 'నేను' అనుదానికి సుఖదుఃఖమాత్రసంబంధమున్నది. దేహాదుల సుఖదుఃఖములయందు, ఈ 'నేను' కేవలసుఖదుఃఖముల యనుభవమును మాత్రమే చేయుచున్నది. ఎందుకుఁ జేయుచున్నదో మునుముందు చెప్పఁబడును. వాస్తవముచే 'నేను' సుఖదుఃఖరహితుఁడై దేహాదిశూన్యుఁడైన యొకఁడు.

ఈవిధముగా మనము దేని యాథార్థ్యమును వెదకుచున్నామో దాని జాడ దొరికినది. ఇఁక మనము దాని స్వరూపమును దెలియఁ బ్రయత్నింతము. ఇంతదాఁక విచారబుద్ధి

సహాయముతో ముందడుగు వేసితిమి. ఇపుడు శాస్త్రయుక్తుల సహాయమును గైకొందము. ఏమన, ఆత్మస్వరూపజ్ఞానము కావలయునన్నచో, వాని కృపను మించిన యుపాయము మఱి లేదు. "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ" యని గీతాగురుఁడు నంగీకరించినదే. మన క్షుద్రబుద్ధివలన నెంత ధారణ కాఁదగుచున్నదో, యంతఁ దెలియఁ బ్రయత్నించుటందు హాని యేమున్నది?

సరే; దేహాదులకంటెను వేఱయిన 'నేను' అను దాని సంధానము పొందఁబడినది. ఇఁక దాని స్వరూపముం దెలియనో తెలియఁజెప్పనో పూనినచో నొక నిశ్చయమునకు రావలయును.

అచింత్యము, అవ్యక్తము, సర్వేంద్రియాగమ్యము నైనదే సత్యమొకటి యున్నది. విచారించిన నా 'నేనె' వరో పట్టువడదు. మాటలచే నిట్టిదని చెప్పనుఁగాదు. అయినను దానిం దెలిసికొనఁగలము. ఏలన నది సత్యము. సత్యమనెడి యే 'నేను' కలదో దానిని మనము సర్వదా యనుభవించుచునే యున్నారము, గాని తెలియ లేకున్నాము. బాగు! ఈ నేననుదానికే, సత్యము ఆత్మ యని పేర్లు పెట్టుచున్నాము.

శాస్త్ర మేమనుచున్నది? ఈ యాత్మస్వరూపము ఆనందమనుచున్నది. ఆనందవస్తువును విడదీసినచో మనమేమి కనుగొందుము? అదె సత్యజ్ఞానానందములని. (అదె సత్ — చిత్ — ఆనందము అని). సత్ = ఒక యునికి; చిత్ — ఈయునికియే చైతన్యమనుము. ఆసత్తయే యీవిధముగాఁ (చైతన్యమయముగా) ప్రతీతమగుచున్నది. అది కేవలసత్త కాదు. అది చిన్మయము; అనఁగా జ్ఞానమయము. మఱి యీజ్ఞానమయ

సత్తయే ఆనందమయము, నిరవచ్ఛిన్నము. ఇంకను సరళమైన భావముతో నాలోచింతము.

నేనున్నాను, నేను దెలిసికొనుచున్నాను. ఏమని? నేనున్నాను అనియు, నేనన్నదే నాకన్నిటికంటెను బ్రియతమవస్తువనియుఁగాదా. ఇందుచేత అదే, ఆ నేనన్నదే ఆనందమయము. ఈసచ్చిదానందస్వరూపాత్మయే 'నేను'. ఈ నేనె సత్యము = త్రికాలాబాధ్యము; మున్నుంటెను, ఇపుడున్నది, ముందుండును. మున్ను నా బాల్యమందని, ఇపుడు నాయౌవనమందని, ముందు నావార్ధకమందని మనము చెప్పికొనుచుండుటచేఁ ద్రికాలాబాధ్యమని గదా యర్థము. అదె సత్యము, అనఁగా నిత్యము. ఇదిగో యీసత్యలాభమే జీవుని యుద్దేశ్యము (లక్ష్యము). ఇంకను దీని సచ్చిదానందస్వరూపమును వివరించుకొందము. మెలఁకువతో నున్నపుడు, అనఁగా స్థూలేంద్రియసంబంధమున్నపుడు (ఇదె జాగ్రదవస్థ) నేను చూచితిని (కంటితో), నేను వింటిని (చెవితో), నేను రుచి చూచితిని (నాలుకతో) నిటులు తానింద్రియములతోఁగూడి యాడుకొనుచున్న యవస్థకు సర్వమునకు సాక్ష్యమిచ్చుచున్నాఁడు. స్వప్నమందయిన దానికిని (సూక్ష్మేంద్రియసంబంధముతోడి తన యవస్థకును) అనఁగాఁదాను గలఁగన్న దానికిని మేలుకొనఁగానే యటులే సాక్ష్యమిచ్చుచున్నాఁడు. గాఢనిద్రయందు (సుషుప్తియందు) నేనేమియు నెఱుఁగననియుఁదన యజ్ఞానావస్థకును (ఇంద్రియ విషయసంబంధమింతయు లేని యవస్థ) మేలుకొనఁగానే సాక్ష్యమిచ్చుటే గాక, అపుడు హాయిగా (ఆనందముగా) నిదురించితిననియుఁజెప్పుచుండుటచేఁదన స్వరూపమానందమనియుఁజెప్పుచున్నాఁడు. ఈతీరుగా మూఁడవస్థలయందును దాను తెలివియే

డై సాక్ష్యమిచ్చుచున్నాఁడు; కనుక సత్యము జ్ఞానము ఆనంద ములు తన రూపములని చెప్పికొనుచునే యుండియుఁ దెలియ లేకున్నాఁడు. అన్ని యవస్థలయందు నుండుటచే సత్; ఉండుటెల్ల జ్ఞానస్వరూపముతో సాక్షియై కావున చిత్; వైషయికముల నెఱుంగఁజాలని, స్వస్వరూపమైన హాయి (ఆనందము) యుందు టచే ఆనందమునునై — యనఁగా (సచ్చిదానందములు) తన రూపమని చెప్పికొనుటే కాదా?

కావున 'నేన'న్నదే సత్యము. ఈసత్యలాభమే జీవ మాత్రుని యుద్దేశ్యము. సబబేమనఁగా, ఆ 'నేను' అను దానికిఁ బుట్టుట, చచ్చుట, కీడు, మేలు, నగవు, వగపు మున్నగునవి యేవియు లేవు. పూర్ణానందస్వరూపము.

ఐనను, లౌకికానందమును నీయానందమును సరిగానొక్కటి కావుచుఁడీ; లోకమునందభీష్టవస్తువు లభించినంతనే జనుఁడు సుఖించు (ఆనందించు) చున్నాఁడు. దానికి వైపరీత్యమైనపుడు దుఃఖించు చున్నాఁడు. మఱి, యీ నేనన్నదియో అభీష్టము, అనభీష్టము, పొందుట, పొందకుండుట మున్నగునవేవియు లేని నిరతానంద మయక్షేత్రము. పెక్కేల? దానికి దేహము, మనస్సు, ప్రాణము, ఇంద్రియములు, ధర్మము, అధర్మము, సుఖము, దుఃఖము, జగత్తు మున్నగు భావము లేవియు లేవు. అది సర్వ భావవిముక్తమయిన సచ్చిదానందస్వరూపాత్మ. అదే నేను. అదె సత్యము. దాని యందు నిత్యయుక్తుఁడై యుండి సుఖానుభూతి నొందుటే బ్రాహ్మీస్థితి. మొత్తమున, సర్వదా యీ 'నేను' అను వస్తువును ధరించి యుంచుటే (నిరంతరధ్యానబలముచేఁ

దానినిదక్క నన్యమును దలంపకుండుటే) మనుష్యుని మనుష్యత్వము. 'నేను' అననేమో తెలియని వాఁడే పశువు (జన్మపాశబద్ధుఁడు) అని శాస్త్రకారుల మాట. ఈ 'నేనే' సాధకుల యిష్టదైవము. కాళీ, కృష్ణ, శివ, చండీ, దుర్గా, త్రిపుర, అల్లాహ్ మున్నగునవి దీని పర్యాయపదములే.

ఏసాధకుఁడెంతగాఁదన యిష్టదైవమునకుఁజేరువగా మెలఁగునో, యంత యున్నతిని సుగమును బొందును. ఏమన, సుఖమే (ఆనందమే) వాని స్వరూపమని చెప్పితిని గదా. మును ముం దీతత్త్వమే విరివిగాఁబలుతావుల నాలోచించుకొందము.

మాటిమాటికి సీయాత్మతత్త్వవిమర్శనముచేతనే చక్కఁగా నెఱింగికొని, యపుడె చండీతత్త్వమందుఁబ్రవేశింపవలయును.

అమ్భృణఋషి కూఁతురు 'వాక్కు' ఎప్పుడీసత్యమందు (నేనునందు) అవస్థిత యైనదో, అపుడామె యేమి చెప్పినదో, అదె దేవీసూక్తము. (దేవిని గూర్చి చక్కఁగా నిస్సందేహముగాఁజెప్పిన గ్రంథము.)

ఆమె యేమి చెప్పినది? "నేను, ఏకాదశరుద్రులు, అష్టవసువులు అను వాని రూపమునఁబ్రకాశించుచున్నాను."
ఏకాదశరుద్రులు:— రోదయతి సర్వమంతకాలే, ఇతి రుద్రః. వేదభాష్యకారులు సాయణాచార్యులు 'అంతకాలమందన్నిఁటి నేడిపించువాఁడు రుద్రుఁడు' అని నిర్వచించిరి.

చక్షుఃకర్ణాదిపంచజ్ఞానేంద్రియములును, వాక్పాణిపాదాది పంచకర్మేంద్రియములును, మనస్సు నను నీపదునొకండును ఏకాదశరుద్రులు. ఇవె జీవుని జననమరణరూపబంధమునకు హేతు

వ్రులు; కనుకనే యేడ్పించుటకుఁగర్తలు. మనము దేని నింద్రియముల దారిని సదా ఖండఖండమై తన్యసత్తనుగా ననుభవించుచున్నారమో, అది సచ్చిదానందస్వరూపమైన "నేను" — ఆత్మను. ఇతరమేదియును గాదు. నేనె యింద్రియముల దారిని క్షుద్రక్షుద్రజ్ఞానరూపమునఁ బ్రకాశించుచున్నాను. నేను ఏదయియున్నానో దానినే మనము ఇంద్రియములు మనస్సు అనువాని ద్వారా యెఱుంగుచున్నాము. ఎప్పుడింద్రియములును మనస్సును నిదురించునో, అప్పుడు మఱి యాత్మసత్త ననుభవింప లేకున్నాము. అందుచేతనే, ఇంద్రియముల నాయమున మనమేవిషయమును గ్రహించుచున్నామో, అటులే మనసుచే నేదేది విచారించుచున్నామో యది యంతయు సత్యస్వరూపాత్మయే. సాధకులారా! ఈవేదవాక్కులను హృదయమునఁబదిలము చేసికొనుఁడు.

అష్టవసువులు:— వసువులు దేవభేదము (గణముగాఁ గూడి యుండువారు). ధనములు ఐశ్వర్యములు అణిమాదులు అనువాని రూపమున ఆసత్యమే ప్రకాశించుచున్నది. భగవంతుని వసువు శుద్ధసత్త్వగుణముగాఁజెప్పఁబడును గాన విశుద్ధసత్త్వగుణోదయమైనపుడు సాధకునందు గగుర్పాటు, కన్నీరు, వణకు, చెమ్మట మున్నగు నెనిమిది బహిర్లక్షణములు ప్రకటమగును; అవే అష్టవసువులు. అవె అష్టైశ్వర్యములు. ఈయష్టవసురూపముగా నైతము 'నేను' అనెడి యాసత్యమే, సత్యస్వరూపాత్మయే ప్రకాశించును.

ఆదిత్యులు — విశ్వేదేవులు:— నేనె ద్వాదశాదిత్యవిశ్వదేవబృందరూపముగా వెలయుచున్నాను. ఆదిత్యులు అదితియం

దుఁబుట్టినవారు అదితి నాశనరహిత - మూలప్రకృతి - త్రిగుణాత్మక (సత్త్వరజస్తమోమయి). బుద్ధి, అహంకారము, చిత్తము, మనస్సు అను నీ యంతఃకరణచతుష్టయము ప్రకృతి వల్లనే కలిగినది. నాలుగంతఃకరణము, మూడు గుణముల సంయోగముచే న్యూనాధికతానుసారముగాఁబండ్రెండు భేదములుగలవి యగును. సత్త్వగుణాత్మకబుద్ధి, రజోగుణాత్మక బుద్ధి, తమోగుణాత్మకబుద్ధి; యిటులే మనశ్చిత్తాహంకారములను గుణించి చూడఁగాఁబండ్రెండగును. ఇవె ద్వాదశాదిత్యులను పేర వెలయును. వీని రూపముగా నేను (సత్యస్వరూపాత్మ) ప్రకాశించుచున్నాను.

ఒకసారి మనసును రుద్రుఁడనియు, మఱొకసారి యాదిత్యుఁడు ననుటయందుఁదప్పులేదు. మనస్సుయొక్క యంశజ్ఞానమే కర్మేన్ద్రియాభిముఖమై(ఇన్ద్రియకేంద్రమై)దుఃఖదాయకమగును. అపుడు రుద్రుఁడు. మఱి యే యంశజ్ఞానము బుద్ధికి (మహత్తత్త్వమునకు) అభిముఖమై (జ్ఞానేంద్రియాభిముఖమై)సుఖదాయకమగునో అది యపుడు ఆదిత్యుఁడు. అనఁగా మనసుయొక్క యీయంశమందుఁజైతన్యప్రకాశమధికమని భావము.

విశ్వేదేవులు:— ఏ చైతన్యము ఈ విశ్వరూపమందు విరాజమానమగుచున్నదో అదె విశ్వేదేవుఁడు. అనేకనామరూప వ్యవహారములు గలదయి విశ్వరూపముగా నేచైతన్యసత్త వెలయుచున్నదో దాని పేరె విశ్వేదేవుఁడు. ఇది యనేకనామరూప విశిష్టమై ప్రకాశించుటచేతనే విశ్వేదేవగణమయ్యెను. ఆ చైతన్యాంశ మసంఖ్యభేదములతోఁదోఁచుట కిదియే కారణమై విశ్వేదేవులనేకులయిరి. ఈ విశ్వేదేవమూర్తులయందును నేను

(తత్త్వమే)నిత్యము ప్రకాశించుచుండును. ఇందువల్లనే మనకేది జగద్రూపముగాఁ బ్రతీతమగుచున్నదో, యది 'సత్యమే'. "యదిదం కించ, తత్సత్యమ్" తై॥ శ్రుతి॥ అనఁగా మనకేది ప్రత్యక్షము (ఇంద్రియములచేఁ దెలియఁబడుచున్నదో) అగుచున్నదో, అది యంతయు 'సత్యమే'.

సాధకులారా! ఈ కానవచ్చు విశ్వజగత్తంతయు'సత్యము' (నేను)యొక్క ప్రకాశమే యనుట మర్వోకుఁడు. ఈ ప్రపంచమంతయు 'నేను'యొక్క వ్యక్తరూపమే ఈ తత్త్వమంతయు దేవీమాహాత్మ్యమందు విశదము కాఁగలదు.

మిత్రావరుణులు:— మిత్రపదము సూర్యనామములలో నొకటి. ద్వాదశాదిత్యులలో నిది ప్రథమము, ప్రధానము. అంతఃకరణము యొక్క సత్త్వగుణప్రకాశమునకే మిత్రుఁడని పేరు. సారమైన మాట యేమనఁగా, ధర్మమే మిత్రుఁడు; ధర్మమే యథార్థబంధువు; మనము మరణించిన వెంటనే తోడనే వచ్చుచు నానందమును గలిగించునది ధర్మమను మిత్రుఁడే.

వరుణుఁడు జలాధిదేవత. జీవుని సంసారసాగరమునందనంతకాలము ముంచువాఁడు. ఇచ్చోట నధర్మమే వరుణశబ్దము నర్థము. 'వృణోతి పాశైరితి వరుణః' సంసారమనెడి త్రాళ్లచేఁ గట్టువాఁడు. కనుకనే వరుణునకు 'పాశీ'యని పేరు. పాశములు గలవాఁడు పాశి. సంసారబంధన యోగ్యపాశము అధర్మము; కావుననే 'మిత్రావరుణౌ ధర్మాధర్మౌ' అని శ్రుతియు నుడువుచున్నది. ఈ రెండును 'నేను'అనుదాని రూపమే.

ఇంద్రాగ్నులు:— సుఖదుఃఖములు; ఇంద్రుఁడు ఐశ్వర్యశాలి, సుఖస్వరూపుఁడు; అగ్ని తనదాహజనకత్వముచే దుఃఖ

స్వరూపము. కావున నింద్రాగ్నిపదములకు సుఖదుఃఖములని యర్థము.

ఇటులే, అశ్వినులు ప్రాణాపానములు. "అశ్వినౌ ప్రాణాపానౌ" శబ్దకల్పద్రుమము. 'అశూ వ్యాప్తౌ' గమనస్వభావము గలవారు. వాయురూపములు, గాన ప్రాణాపాన వాయువులను అశ్వినీకుమారులందురు.

మిత్రావరుణులు — ఇంద్రాగ్నులు — అన్నట్టులే అశ్వినులు ఉభయాత్మక దేవతలు గాన ద్వంద్వము. స్థూలజగత్తునందీదేవతలు ధర్మాధర్మములు, మఱి వానివలనఁగల్గు సుఖదుఃఖములు; వాని భోగస్థానము అపానసహితప్రాణము. వీని రూపముతో 'నేను' = విశుద్ధచైతన్యమయాత్మయే వెలయుచున్నది. ప్రాణమనఁగానే జడవాయుమాత్రమే కాదు. అనుభూతిస్థానము. అపానసహచారిత్వమే కారణముగాఁ ప్రాణమునకు భోగసిద్ధి. ఉభౌ బిభర్మి=రెండింటిని ధరించుచున్నాను. అనఁగా ఆత్మగాక వేఱుగా మఱి యొకటి లేదు గాన, నదే యీ రూపములతోఁ బ్రకాశమానమగుచున్నది. ఈ విశిష్టభావములతోఁ బ్రకాశించుచున్నను దన విశుద్ధాఖండచైతన్యసత్తకు బిందుమాత్రమైనను గొఱఁత లేదు.

ఆత్మ యొక్కఁడే జగత్తునకు నిమిత్తకారణమును ఉపాదానకారణమును నైనది. కుమ్మరి కుండవంటిది కాదు. కుండకుఁ గుమ్మరి నిమిత్తకారణమును, మన్ను సారె మున్నగునవి యుపాదానకారణమును నగుచున్నవి. జగత్కారణవిషయమున నిటులు కాదని యెఱుఁగునది. ఏలన, "సోఽకామయత। బహుస్యాం ప్రజాయేయ।" అను శ్రుతిచే,ఆత్మయే నిమిత్తకారణము; "ఆత్మన

ఆకాశః సంభూతః। ఆకాశాద్వాయుః। వాయోరగ్నిః। అగ్నే రాపః। అద్భ్యః పృథివీ॥” ఇత్యాది శ్రుతిచే ఆత్మయే ఉపాదాన కారణమునగుచున్నది. తన రూపములే యైన పంచభూతములు ఉపాదానకారణమగుటచేత, ఉభయకారణత్వము ఆత్మదే. ఇందుచేత 'నేను' ఒక్కటే యైనను అనేక భావములతో వెలయు చున్నది. అనేకభావములను ధరించు కర్తయై యున్నది. కనుకనే వాక్యమందు 'బిభర్మి' యని ప్రయోగము.

ఇక్కడ మఱొక్కమాట. రుద్ర, వసు, ఆదిత్య — మున్నగు పదములకిట్టి వ్యాఖ్య చూచి 'ఇది మాకు నచ్చలేదు. ఈ నామములకు దేవమూర్తులున్నవా?'యందురేమో! వినుఁడు- రుద్రాదిశబ్దములు, ఎట్టి విశిష్టచైతన్యమును ప్రకాశింపఁజేయునో, యట్టి విశేషభావమునొందిన చైతన్యాంశముల నామములే దేవతలై, యవి యంతటను విరాజిల్లుచున్నవి.

భక్తుల కాతరప్రార్థనములకు లోఁగి కృపాపూర్వకవిశిష్ట మూర్తులతో ఆ సత్యవస్తువే ప్రకాశించును. కావుననే పురాణ ములందు దేవమూర్తుల వర్ణనము విపులముగాఁ గానఁబడును. దేవతాతత్త్వద్వితీయఖండమందది విపులముగాఁగానవచ్చును.

2. అహం సోమమాహనసం బిభర్మ్యహం త్వష్టారముత
పూషణం భగమ్। అహం దధామి ద్రవిణం హవిష్మతే
సుప్రావ్యే యజమానాయ సున్వతే॥

యాగాదులయందు అభిషోత్యమైన (దంచివడఁబోయఁ దగిన) సోమరసమును నేనె భరించుచున్నాను. త్వష్టను, పూషుని, భగుని నేనె భరించుచున్నాను. హవిర్హోమములు చేసి దేవతలకు హవిస్సుల నందించు సోమయాగమొనర్చు సోమ

యాజులకు, యాగఫలమనెడి ధనమును నేనె యిచ్చుచున్నాను. (దీనిచే బ్రహ్మమునకు ఫలదాతృత్వాపత్తి) నేనె శత్రుహంతమైన సోముని, త్వష్టను, పూషుని, భగుని ధరించుచున్నాను. దేవతల నుద్దేశించి ప్రచురహవిర్యుక్తముగా సోమయాగాదులను జేయు యజమానుల యజ్ఞఫలమును నేనె ధరింతును.

వి॥ అహనస్ = శత్రుహంత యని యర్థము. సోమ మనఁగా సోమయాగము. దుర్జయులైన కామక్రోధాదిశత్రువులను గెలుచుటకై సోమయాగాదులు చేయఁబడును.

పక్షాంతరమున — సోముఁడనఁ జంద్రుఁడు. ఆతఁడు మనస్సునకధిపతి. ఎపుడు మనస్సు కామక్రోధాదివృత్తులనెడి శత్రువులకు వశము గాక పోవునో, యపుడు వానిని గెల్చునది (చంపునది) యగును, గాన సోముఁడనఁబడును.

త్వష్టా = విశ్వకర్మ; అనఁగా నీవిశ్వముయొక్క ఘట నము చేయువాఁడు. ప్రపంచమును నిర్మించు పని చేయువాఁడు. అనఁగా నేచైతన్యము మూలముగా నీవిశ్వఘటనము బహు ప్రకారనామరూపములతో వ్యాకృతమగుచున్నదో, అదియే త్వష్ట.

పూషన్ = సూర్యుఁడు, పుష్టిరూపచైతన్యము. ఏచై తన్యము దేహమును మనస్సును బోషించునదిగా నున్నదో, యాచైతన్యమునకే 'పూషా' యని పేరు.

భగ = షడ్విధైశ్వర్యము; అనఁగా నీశ్వరత్వము. అన్ని విధముల నభ్యుదయమును, అమోఘసంకల్పమును (కోర్కి మొక్కపోకుండుట) రూపముగా నేచైతన్యము వెలయు చున్నదో, యదె భగశబ్దవాచ్యము.

వీరిని — అనఁగా, శత్రుసంహారకారి సోముఁడు, విశ్వసృష్టిజనకారి త్వష్ట, పోషణశక్తిరూపుఁడు పూషుఁడు, పశ్వాద్యైశ్వర్యమయుఁడు భగుఁడు, ననువీదేవతలను 'నేనె' ధరించుచున్నాను. అనఁగా, సచ్చిదానందస్వరూపాత్మనైన 'నేనె' యీ స్వరూపములతో వెలయుచున్నాను.

'అహం దధామి ద్రవిణం' — ద్రవిణమును (ధనమును) నేనె ధరించుచున్నాను. కేవలసోమయాగాదికర్మకాండరూపముగా ధరించుటె కాదు. కర్మకాండమునవలని ధనము (ఇష్టద్రవ్యము) ఏదో, అదియు నాచేతనే ధరింపఁబడుచున్నది. శాస్త్రోక్తమైన కర్మకాండము యథావిధిగా ననుష్ఠింపఁబడినపుడు, దానివలన నొక యపూర్వమైన (శుభంకరమైన) యదృష్టఫలము గలుగును. సమయము వచ్చినపుడు ఆయదృష్టమే యథోక్తఫలమును గలిగించును. ఈయపూర్వతకే ద్రవిణమని పేరు. అదె కర్మఫలమనెడి ధనము. దానిని నేనె ధరింతును. అనఁగా కర్మఫలప్రదాత్రిని 'నేను'.

'హవిష్మతే సుప్రావ్యే యజమానాయ సున్వతే' యజమానులు (యాగములు చేయువారు — కర్మకాండము ననుష్ఠించు వారు) దేవతల నుద్దేశించి బహుహవిస్సులతో సోమయాగాదులను జేయుదురు. ఆయాగాముల నగు ద్రవిణమును గాలాంతరమున భావిఫలముగా యజమానుల కిచ్చు నిమిత్తము 'నేనె' ధరించి యుంతును.

ఈయాగము అంతరమైనను ఫలప్రదాతృత్వము చిచ్ఛక్తిస్వరూపమైన యీ 'నేను' దే. అదె భగవత్పూజ్యపాదులు శ్రీశంకరులు తమ సౌందర్యలహరిలో, 33 వ శ్లోకమందు

"శివాగ్నౌ జుహ్వాంతః సురభిఘృతధారావహుతిశతైః" అని ప్రతిపాదించిరి. ఇచట శివాగ్ని బైందవస్థానమైన త్రికోణము. సురభిఘృతధారలతో వేల్చుటనగా, సర్వవాసనలను దొలఁగించుకొని "శివోఽహం" మనెడి మహావాక్యార్థబోధముతో నిల్చుట. దీని ద్రవిణము (ఫలము) పరమానందము. అంతర్యాగ ఫలము.

ఒక్క చైతన్యస్వరూపాత్మయైన 'నేనె' సర్వకర్మరూపము గాను, కర్మోపయోగివస్తురూపముగాను, కర్మసంస్కారరూపముగాను, కర్మఫలరూపముగాను వెలయుచున్నాను; అని యిమ్మంత్రార్థము.

3. అహం రాష్ట్రీ సంగమనీ వసూనాం చికితుషీ ప్రథమా యజ్ఞియానాం। తాం మా దేవా వ్యదధుః పురుత్రా భూరి స్థాత్రాం భూర్యావేశయంతీమ్॥

నేనె జగదీశ్వరినై యుపాసకుల యభీష్టములిత్తును; సాక్షాత్కరించుకొనఁదగిన పరబ్రహ్మమును నేనయై సాక్షాత్కరించుచున్నాను. కావుననే పూజార్హులలో మొదటిదానను. ఇటులు గుణవిశిష్టనై ప్రపంచస్వరూపముతోనుండి, భూతజాతములందు జీవభావముతోఁ బ్రవేశించి యున్న నన్నుద్దేశించియే దేవతలు బహుదేశములందుఁబూజలొనర్చుచున్నారు. (ఇటులు విశ్వరూపముతో నుండుటవలన వారు చేయుచున్నదెల్ల నన్నుద్దేశించియే యని భావము.

వి॥ నేనె యీబ్రహ్మాండమున కేకాధీశ్వరిని. నేను లౌకికపారలౌకికధనముల నీయఁగలదానను. 'నేనె' బ్రహ్మసాక్షాత్కారరూపజ్ఞానమనై యున్నాను. ఈజ్ఞానమె సర్వవిధములైన

యుపాసనములకును బునాది. నేనె ప్రపంచరూపముగా ననేక భావములతో (వికారములతో) నున్నాను. అయితే యనంత జీవభావముతో భూతజాతములందుఁజొచ్చి యున్నాను. దేవతలు నన్ను యీరీతి ననేకభావములతో నుపాసింతురు.

ఈమంత్రమందు 'అహం' పదము స్త్రీలింగముగాఁ జెప్పఁబడినది. అహమ్ అలింగకము. అన్ని లింగములందును దానికి వ్యవహారము గలదు. ఆత్మవస్తువు పురుషుఁడుంగాదు, స్త్రీయుం గాదు. ఈమంత్రమునందు స్త్రీలింగార్థమునఁబ్రయోగము (రాష్ట్రీ, సంగమనీ, చికితుషీ, ప్రథమా) చూచి, యిటులే యితరమంత్రములందును శక్తిరూపముగానే చైతన్యవికాసముఁ జూచినచోఁదెలియ వచ్చునది యేమనఁగాఁబ్రాచీనాచార్యులెల్లరు నీవేదమంత్రములు దేవీపరములనియే యీగ్రంథమునకు దేవీసూక్తమని పేరుపెట్టిరి.

'అహమ్' అవ్యక్తము అనిర్దేశ్యము నని మున్నే చెప్పితిని. వాక్యములలోనికి రాఁగానే, యది శక్తిరూపముగా వెలయింపఁబడినది. రాముఁడు, కృష్ణుఁడు, శివుఁడు మున్నగు పుంలింగపదములే ప్రయోగింపుఁడు; దుర్గా, కాలీ, రాధా, త్రిపురసుందరీ మున్నగు స్త్రీలింగశబ్దములే ప్రయోగింపుఁడు; లేదా, బ్రహ్మము మున్నగు క్లీబలింగశబ్దములే ప్రయోగింపుఁడు; అందు వచ్చి పోవునదేమియు లేదు. అపుడేది స్థిరమైనదో, ఎంతదాఁక మనోబుద్ధీంద్రియధ్యానధారణద్వారా ప్రకాశితమగునో, యది యంతదాఁక శక్తిరూపముగానే ప్రత్యక్షీభూతమగును. ఉండనిండు. ఇఁక మనము మంత్రార్థము నెఱుంగఁబ్రయత్నింతము.

రాష్ట్రీ = ప్రపంచరూపముగా వెలయు ననంతబ్రహ్మాండముల సృష్టిస్థితిప్రలయతిరోధానానుగ్రహములనెడి యయిదు కృత్యములను జేయఁజాలినది ఒక్కమాట, జగదీశ్వరి.

వసు = ధనము. గోవులు, బంగారు, వెండి, యిండ్లు, భూములు, పుత్త్రులు మున్నగు లౌకికధనమును, జ్ఞానవిద్యాధర్మనీత్యాదులైన యలౌకికధనమును, ముఖ్యముగా నిచ్చునది, కాఁగా "సంగమనీ" సర్వప్రకారధనదాయిని ఆ 'నేను' అన్నదే.

ఇంతకు మున్ను ధనరూపముతో నేనె వెలయుదునని చెప్పినది; ఇపుడు, ఆధనమును బొందించు దాన నేనె యన్నది.

చికితుషీ యనఁగా బ్రహ్మజ్ఞానము. ఏజ్ఞానము వలన నేది 'నేను' అను దాని జ్ఞానమును గలిగించుచున్నదో ఆజ్ఞాన స్వరూపము 'నేను' తల్లిని.

ప్రథమా యజ్ఞియానామ్ — ఈజ్ఞానమే యజ్ఞాంగ సమూహమునందు మొదటిది. నేను అను దానిస్వరూపము నెటులో శ్రమపడి యెఱింగికొని, యజ్ఞాద్యుపాసనమందుఁ బ్రవర్తింతురు. అటు కానిచో నాకర్మములు విధిరహితములే యగును. గాన,చికితుషియే ఉపాసనములకెల్ల 'ఆది'. దీనిచే మనకు దెలియునది యేమి ? ఉపాసనము. ఉపాసనఫలము ఉపాసనమునకు మూలమైన జ్ఞానముగా నైతము ఒక్క నేననెడి చైతన్యసత్తయే ప్రకాశించుచున్నదని కదా.

భూరి స్థాత్రా = అనేకభావములతో (రూపములతో) నుండునది.

భూరి ఆవేశయంతీ = అనఁగా ననేకభావములయందుఁ జొచ్చి యుండునది.

అనంతభావములతో నున్నదానను 'నేను'. అనేక భావములందు నిత్యముఁబ్రవేశించి యున్నది 'నేను'. అట్టి నన్ను దేవతలు తల్లి యనిరి. ఇటులు 'నేను' (ఆత్మ) అను దానిని దేవతలు భజించుచున్నారు.

ఉన్నతజ్ఞానవీర్యసంపన్నసంతానము దేవతాగణము. అది యీ యనంతవైచిత్ర్యముతో నిండిన జీవజగద్రూపముగాఁ బ్రకాశించుచున్న 'నేను' అను దానినే యనేకవిధములుగా నుపాసించుచున్నది. అనఁగా గానఁబడుచున్నదంతయు, నందున్నదంతయు 'నేను'. అదే సత్యము, ఆత్మ. ఇట్టి జ్ఞానముతోనే మీరు సరళశిశువులవలె నన్నే యాత్మ యని, తల్లి యని గొంతెత్తి పిలువుఁడు. ఇదె దేవతాలక్షణము.

4. మయా సోఽన్నమత్తి యో విపశ్యతి యః ప్రాణితి య
ఈం శృణోత్యుక్తమ్। అమన్తవో మాం త ఉపక్షి
యన్తి శ్రుధి శ్రుత శ్రద్ధివం తే వదామి ॥

అన్నము తినువాఁడు భోక్తృశక్తిరూపనైన నాచేతనే తినఁగల్గుచున్నాఁడు. చూచువాఁడు చూచుశక్తినైన నాచేతనే చూడఁగల్గుచున్నాఁడు. వినువాఁడు వినుశక్తినైన నాచేతనే వినఁగల్గుచున్నాఁడు. ఊపిరి తీయుట విడుచుట యను పని చేయువాఁడు ప్రాణశక్తినైన నాచేతనే యవి చేయఁగల్గుచున్నాఁడు. ఇటులన్నింటను శక్తిరూపమున నున్న దానినిగా నన్నెఱుంగని వారే యెఱుక లేనివారు. వారే పుట్టుసావులనెడి సంసారమునఁ బడి చెడుచున్నారు. ఓయి, సఖుఁడ! నేఁజెప్పఁబోవునది వినుము. శ్రద్ధతోఁగూడిన ప్రయత్నముచేతనే పొందఁదగిన యిట్టి బ్రహ్మాత్మకవస్తువును నేను నీకుపదేశించుచున్నాను.

వి॥ యోఽన్నమత్తి. తినఁబడు వస్తువంతయు నన్నమే. స్థూలదేహమును బెంచుటకే కానీ, మనోమయాదిసూక్ష్మదేహ పుష్టికే కానీ, జీవుఁడెట్టి యాహారవిహారసంగ్రహము చేయు చున్నాఁడో యది నిర్వహించుచున్నదానను, సచ్చిదానంద రూపాత్మను 'నేనె'.

యో విపశ్యతి — తెలివికంటితోనో, తోలుకంటితోనో, జీవుఁడేది ప్రత్యక్షము చేసికొనుచున్నాఁడో అప్రత్యక్షము చేయుట యను క్రియయు 'నేను' ద్వారానే నెరవేఱుచున్నది.

యః ప్రాణితి — సదా యూపిరి తీయుట విడుచుట యను ప్రాణనక్రియచేతనే జీవగణము జీవితమగుచున్నది. దాని కర్తయు 'నేనె'.

యః శృణోతి — కర్ణేంద్రియము దారిని జీవగణము శబ్దమును గ్రహించుట యను క్రియకు సైతము కర్తను 'నేనె'.

ఇటులన్నివిధములైన పనులును నావల్లనే సిద్ధమగు చున్నవి. ఈమాట నమ్మని వారె నన్నవమానించువారు. మనుష్యుఁడు రేవగళ్లు నేదో కర్మము చేయుచు నది నాప్రయ త్నమే యని వదరుచున్నాఁడో, ఏయహంకారముతో బోర విఱుచుకొని తిరుగుచున్నాఁడో ఆపురుషకారమెవరిది? ఆపురుషుఁ డెవఁడు? ఆయహంకారరూపకార్యమేది?

"నేత్రాదిజాలకోపాంతే హృత్పాదాసనలీలయా।
వారం వారం త్వయా దేవి రూపాదిమధు సేవ్యతే॥"

సౌభాగ్యహృదయము.

కొంచెము విచారించినచో సర్వముం దెలియఁగలదు. అయినను దెలియఁబూనని వాఁడె 'నేను' అను దాని నుపేక్షించు పండితంమాని, అవమానించువాఁడు, అవమానమొందువాఁడు.

ఈశోపనిషత్తు ఇట్టివానినే "ఆత్మహా = ఆత్మఘాతిపురుషః" యన్నది. ఇటుల "సత్యమును" నన్ను "ఆత్మను" అవమానించు వారే "త ఉపజాయంతే" పుట్టుచావులనెడి సంసారమందనేక విధములుగా గుందుచున్నారు.

ప్రకాశరూపధర్మము పశుపక్షులు మున్నగు వానియందు సైతము గానవచ్చుచున్నది. జీవులలో శ్రేష్ఠుడైన మనుజునందు ఈ ధర్మవికాసమే లేనపుడు వానిని పశువుకంటెను హీనుడన్నచో నన్యాయ మేమున్నది? చూడగా జగత్తునం దెల్లరదృష్టియందు నిది యుపేక్షింపబడుచున్నది.

ఆలోచింపుమా! నీవు దారిబోవునపుడు నీకు సంకటదశ యొకప్పుడు గలుగవచ్చును. ఒక్కడబ్బునకును ఇబ్బంది పడుదువు; నీ తావు నీవు చేరగానే నీకు వందకైనను లోటు లేదు. కాని యపరిచితస్థలమందుజిక్కువడుటచేత నీవిపుడవమానితుండవై యున్నావు. అట్టి యపుడు పాతచికము లేని యొకడు, అయాచితముగనే సిగ్గొకచెంగి నీకొపైసా యిచ్చి యుపకారము చేయుననుకో. అపుడు నీవిల్లు చేరగానే ఆ యొక్కపైసాకు బదులు పది రూపాయలిచ్చి వేయుదువు. దేవుడై కాపాడినాడందువు. ఆ దేవుడే వీనిని బంపినాడందువు. నీవు బ్రతికిన యంత కాలమును నీ హృదయమందు ఆ పైసాతోగూడ, నది యిచ్చిన వానిని స్మరించుచు సన్మానించుచుందువు. వానియెడ నట్టిట్టిదనరాని కృతజ్ఞభావమును, నమ్రభావమును నీ హృదయమందుం బుట్టుచునే యుండును. కాన నీవు మనుష్యుడవే యైనచో, నేది మన సర్వకర్మములకుం బ్రేరకమై యున్నదో, దేని ప్రకాశము గ్రమ్ముటచేతనే మన యీ జగద్వ్యాపారభోగవాసనలు పూర్ణమగుచున్నవో, యేది మనకు సర్వస్వప్రాణశక్తియో, యేది నమ

సర్వస్వమో, దానివంక నీవు పూర్ణసరళభావముతో నొక్క కృతజ్ఞతాపూర్ణదృష్టి పఱపవలదా? పఱప లేకున్నావు.

ఇందుచేతనే, ఆత్మయు సత్యమునైన మనతల్లి(జగన్మాత) గంభీరస్వనముతోఁగరుణతో, "ఓయి! మంచివాఁడా! 'తే వదామి శ్రద్ధివం శ్రుధి' నేఁజెప్పునది సద్దమై వినుము. నీ యందాత్మ స్వరూపమై యేది ప్రకటితమగుచున్నదో దాని మహత్త్వమును జూడుము. 'నేను' అను నా సత్యమునెడ నసద్ద చేయకుము. దానియెడఁగృతజ్ఞుఁడవగుము. దానినె పూజింపుము." అను చున్నది.

జీవుఁడా! చూడుము; నీయాహారవిహారములు మున్నగు జాగతికకార్యములు — చిన్న యూపిరి తీయుట మొదలు మోక్షప్రాప్తిపర్యంతము ప్రత్యేకకర్మమందును చైతన్యరూప ముగా, జ్ఞాన బోధరూపముగా ఏది ప్రకాశించుచున్నదో చూడుము! ఎచ్చటినుండి కర్మ యుబుకుచున్నదో, మఱల దేని యందు లీనమగుచున్నదో చూడుము. సర్వకర్మనియంత యెవరో తెలియుము. మఱెవ్వరుంగాదు. అది నీవు సర్వదా యనుభవిం చుచునే యున్నావు; అది నీకుఁగేవలము ప్రత్యక్షము; దానిని విడిచి నీవు క్షణమైన నుండలేవు. అదె నీ ప్రియతమవస్తువు. దానికి నీవు దూరముగా నున్నావనుకొంటే దూరమే. అటులు పొరపడవేని నీకదె యన్నింటికంటెఁజేరువనున్నదే చుమా! అదె నీ 'నేను' సర్వేంద్రియాగమ్యమైనను సత్యమే; దానినె శరణొం దుము.

౫. అహమేవ స్వయమిదం వదామి జుష్టం దేవేభిరుత
మానుషేభిః। యం యం కామయే తం తముగ్రం
కృణోమి తం బ్రహ్మాణం తమృషిం తం సుమేధామ్॥

నేనే యీ బ్రహ్మతత్త్వవస్తువని నీకుఁజెప్పుచున్నాను. ఇంద్రాదులు వేల్పులు నన్ను సేవింతురు. ఇట్టి నేనెవ్వని రక్షింపఁ దలంతునో వానిని సర్వాధికునిగాఁజేయుదును. వానిని సృష్టి సమర్థునిగాఁ జేయుదును. వానిని అతీంద్రియసూక్ష్మదర్శనుఁడైన ఋషిగాఁజేయుదును. వానిని శోభనప్రజ్ఞ గలవానినిగాఁజేయుదును. (అనగా బ్రహ్మజ్ఞానినిగాఁజేయుదును.)

వి॥ 'నేను' అను దాని తత్త్వమును, నేను గాక మఱె వ్వరు చెప్పఁగలవారు? కారణమేమన — నేనె తెలిసికొనుదానను; నేనె తెలియఁబడు దానను; నేనె తెలిపెని. నన్నెఱుంగువారు మఱియొకరు లేరు. అందుచేతనె "అహమేవ స్వయం వదామి" నేను స్వయముగా నీకు బ్రహ్మతత్త్వోపదేశము చేయుచున్నా నన్నది. మఱియు నీ తత్త్వము (ఆత్మస్వరూపబోధము) వేలుపు లును మనుజులును గోరఁదగినది. బ్రహ్మవిష్ణుమహేశ్వరాది దేవతాబృందము సైతము దాని కొఱకనంతకాలము తపస్సు చేయుచున్నదనుట పురాణములందెన్ని తావులనో కనుచున్నదే, వినుచున్నదే. అత్యున్నత పదవులందుండియు నే వస్తువును వెదకు చున్నారో, యిపుడు మీరు చక్కఁగాఁదెలియఁగలరు. సందే హము లేదు. అదె 'నేను', అదె 'సత్యము'. ఎచ్చట బ్రహ్మత్వ విష్ణుత్వాది భావములు లేవో, యట్టి భావాతీతము నిత్యము నిరంజనము నైన "ఆత్మ నేను" అను దానినే వారనుసంధానము చేయుచున్నారు.

'జుష్టం' అనుదానికి సేవింపఁబడునది యనియు నర్థము; క్తప్రత్యయము వర్తమానమందును వ్యవహరింపఁబడును. దేవతలేయనుఁడు; మనుష్యులే యనుఁడు. తెలిసియో తెలియకో 'నేను' అను వస్తువును సేవించుచునే యున్నారు. తెలియనివారు

జీవభావమునొందిన 'నేను' అను దాని సేవయే చేయుచున్నారు. జ్ఞానులు సర్వభావవిముక్తమైన 'నేనును' సేవించుచున్నారు. 'నేనొక మనుష్యుఁడను; నేనొకఁడను' అనుటేటిది ? జీవభావముతోనే యనుఁడు; దేవభావముతోనే యనుఁడు; లేదా సర్వభావ విరహితమే యనుఁడు; 'నేను' అనునదొక్కటే, సచ్చిదానంద స్వరూపాత్మయే విరాజిల్లుచున్నది అని గదా.

"యం యం కామయే" నేనెవనిని సర్వాధికునిఁగ జేయఁగోరుదునో, వాని నట్టులే చేయుదును. అనఁగా 'నేను' అనుదాని యిచ్ఛతోనే జీవులెల్లరు నున్నతపదవిని బొందు చున్నారని యర్థము.

ఉన్నతి రెండు విధములు — లౌకికము, అలౌకికము, ధనధాన్యాదిసమృద్ధి, యశస్సు, ప్రతిష్ఠ మున్నగునవి లౌకి కోన్నతి. అవి పొందియు, మనము మన దృఢప్రయత్నము కఠోరవ్యవసాయము మూలముగానే పొందుచున్నామనుకొను చున్నాము; కాని యాయున్నతికిని, అభ్యుదయమునకును, ఆపురుషకారమునకును ఒక్కటేయైన 'నేను' అనుదాని యిచ్ఛయే హేతువని తెలియ లేకున్నాము.

తరువాతిది యలౌకికోన్నతి — అది మూఁడు విధ ములు. సుమేధుఁడు, ఋషి, బ్రహ్మ యని. సచ్చిదానందరూప మైన 'నేను' అనుదాని యిచ్ఛచే జీవుఁడు ఎపుడాధ్యాత్మిక జీవనమును రుచి చూడఁగలుగునో యపుడు వాఁడు సుమే ధుఁడు; అనఁగా, ఆత్మజ్ఞానధారణోపయోగియైన బుద్ధి లభించిన వాఁడనుట. ఎంతదాఁక ధారణావతియైన మేధ లభింపదో (శ్రవణా దులచేఁదాను గ్రహించిన సత్యవిషయమును జాఱిపోనీయనిబుద్ధి) అంతదాఁక ("శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః" అను

నట్లు) పలుసారులు ఈజ్ఞానము ఈయుపదేశము శ్రవణము చేయఁబడినను గొంచెమైనను దెలిసికొనఁ జేయదు. ‘‘ఉత్తరోత్తరశ్రేణి ఘానాద్వా’’ అను వేదాంతసూత్రప్రకారముగా (శ్రవణాన మనఁగా ఫలప్రాప్తిపర్యంతమైన యావత్తుగాని చింతనము) చేయఁగా, అధ్యాత్మికజీవనమునకుఁ బ్రథమసూచనము, జీవుఁడు సుమేధుఁడగుట.

తరువాత ఋషిత్వము నొందుట. ‘‘ఋషయో మంత్ర ద్రష్టారః స్రష్టారశ్చ’’ ‘‘జ్ఞానస్య పారగమనాదృషిః’’ ‘‘ఋషయః సత్యవచనాః’’ అనుటచే, ఋషి వేదగుప్తమంత్రములను గాంచి యుద్ధరించువాఁడు, ద్రష్ట; తపోబలముచే మంత్రబీజ వాక్కుల మహిమనెఱింగి మంత్రమును సృష్టించి తత్ఫలమును దెలుపువాఁడు స్రష్ట; బ్రహ్మజ్ఞానము తుదఁజూచినవాఁడు ఋషి. సత్యవచనుఁడు ఋషి; అనఁగా సత్యమును (బ్రహ్మమును) గూర్చియే పలుకుచుండు వాఁడు. సర్వకాలసర్వావస్థలయందును బ్రహ్మజ్ఞానముతోఁగూడి యుండి బ్రహ్మానుభూతి నెవఁడభ్యసించునో, వాని సూజ్ఞానమును అనుభూతియు భాషా రూపముతో వెలువడును; అదే మంత్రము పేరఁబ్రసిద్ధము. ‘‘మననాత్త్రాయత ఇతి మంత్రః’’ అర్థజ్ఞానయుతముగా దానినే తలంచుచుండుటచే రక్షించునది, గాన మంత్రమది; అనఁగా నితరజీవులు సైతము ఆవాక్యములను మననము చేయఁగా సంసారసముద్రమునుండి రక్షింపఁబడుదురు. ఇట్టి మంత్రద్రష్టయు స్రష్టయునో సాధకుఁడు ఋషి. కావుననే యేమంత్రమును మనము జపింపఁబూనినను, ద్రష్టయో స్రష్టయో యైన ఋషిని గృతజ్ఞభావముతో మున్ముగాఁదలఁదాల్తుము. అసలు మాట — సర్వత్రాత్మదర్శియే ఋషి. ఇట్టివాఁడగుటయే యాధ్యాత్మి

కోన్నతియందు రెండవ మెట్టు. అంత జ్ఞానము, అంత బ్రహ్మానుభూతి, అంత సాధనములు, అంత నాదబ్రహ్మసాక్షాత్కారము లేని వాఁడు, ఆ బీజాక్షరములు ఈబీజాక్షరములు, ఆ వాక్యములు ఈవాక్యములు అక్కడక్కడఁ జూచినవి, భ్రమమూలకమైన యజ్ఞానముతో దురభిమానమున, మంత్రసృష్టినని, ప్రతిసృష్టిగా నట్టి పనికిఁ గడంగినవాఁడు ఆత్మహానికిని బరహానికిని నష్టము గట్టినవాఁడే గాక, దానను పాపమునకును నొడి గట్టినవాఁడే.

అట్టి యవివేకసాహసమునకో మంత్రస్రష్టలమని బయల్దేరిన ఋషింమన్యులు మొదలంటఁజెడుట చూచుచున్నారము. వైదికమంత్రమే యైనచో స్వరప్రధానము. తాంత్రికమంత్రమే యైనచో బీజాక్షరప్రధానము. ఇది వైదికమంత్రమే యని తనక్రొత్తవాక్యములను స్వరపఱచఁగలఁడా? స్వరసంధానము చేసి పలికినను "ఇదెందులోని"దని ప్రశ్నించు వేదవేత్తలకు శిక్ష యిచ్చినవాఁడగును. సక్రమాధ్యయనము చేసినవారు సైతము "యథేంద్రశత్రుః స్వరతోఽపరాధాత్" అనునట్లు, స్వరాపరాధమగునేమో యను భయమునఁ బ్రాతిశాఖ్యాదుల సాయమును నిరంతరాభ్యాసమును గోరుచుందురు. ఇఁకఁ దాంత్రికమంత్రములను బోలి సృష్టింతుననుట సుప్తసర్పమును గట్టెతోఁ గొట్టి మేల్కొల్పుటయు, నగ్నితో నాటలాడుటయు వంటిది.

మంత్రబీజములు నాదరూపములు. నాదమనఁగా బ్రహ్మశక్తి. "నారాయణీ నాదరూపా" (నామస్మృతి) ఆశక్తియే పరావాఙ్మయముతో మూలాధారమునందుండి సంకల్పము కలుగఁగానే నాదరూపముతో నాధారోపరిచక్రములందుచ్చ

రించును. ఉచ్చరించుట యనఁగాఁ బ్రాణాపానవాయువుల చేరికతో మీఁది మీఁదికి లేచుట. అది లేచునప్పుడే మూఁడు రూపముల నొందును. "నమామి తాం పరాం వాచం పశ్యంత్యాదిక్రమాశ్రియామ్। నానావిధమహాకారరసానుభవకారణామ్" (సౌభాగ్యహృదయము.) ఆరూపములు పశ్యంతీమధ్యమావైఖరులు. వైఖరీరూపమందే పరుల శ్రోత్రేంద్రియములకుఁ దాకుట. అంత దానికన్నను రెండవస్థలమందు నుచ్చరించునప్పుడు, మొదటిది సంకల్పానుసారముగా నిర్వాణమొటలో చూచునది గాన 'పశ్యంతి.' పశ్యంతికిని వైఖరికిని నడిమి యవస్థ కావుననే మూఁడవది 'మధ్యమా', ఇది యితరులకు వినఁబడక పోయినను బ్రత్యేకపిండమందును లోన వినఁబడుచునే యుండును. (వీని విపులవివరణమును నా చండీపాఠవివరణము మధ్యమఖండమునఁ జూచునది) ఉచ్చారణము మూలాధారాది మూర్ధపర్యంతము నగును. ఈయుచ్చారమార్గమే సూక్ష్మరంధ్రవిశిష్టమగుటచేత "సుషుమ్న", సంచరించు నిల్లగుటచేత "కులము"; ('వసన్ ఋషికులేషు సః., ర.వం) ఈ కులమనెడి సుషుమ్నాభాగమందు సంచరించునది కావుటనే బ్రహ్మశక్తికి, "కులదేవత, కౌలినీ, కులయోగినీ" యనిపేరు. ఈ సుషుమ్నకు శ్మశానమనియు మఱొక పేరు. "శవానాం శయనం యత్ర - శ్మశానం" ప్రేతలుగా భావింపఁబడిన బ్రహ్మవిష్ణురుద్రులు శయనించుచోటు కావున శ్మశానము. ఆ బ్రహ్మాదులుండు చోటులే కులమందు గ్రంథులనఁబడును. ఆ చోటులను దాకుచు నాదరూపిణి బ్రహ్మశక్తి యుచ్చరించుటే గ్రంథిభేదనము. ప్రధానులు బ్రహ్మవిష్ణురుద్రులు సర్వదేవతలకుపలక్షణము. బంధువులను గూర్చునది

కోన్నతియందు రెండవ మెట్టు. అంత జ్ఞానము, అంత బ్రహ్మానుభూతి, అంత సాధనములు, అంత నాద బ్రహ్మసాక్షాత్కారము లేని వాఁడు, ఆ బీజాక్షరములు ఈబీజాక్షరములు, ఆ వాక్యములు ఈవాక్యములు అక్కడక్కడఁ జూచినవి, భ్రమ మూలకమైన యజ్ఞానముతో దురభిమానమున, మంత్రస్రష్టనని, ప్రతిష్ఠాశతో నట్టి పనికిఁ గడఁగినవాఁడు ఆత్మహానికిని బరహానికిని నడుము గట్టినవాఁడే గాక, దానగు పాపమునకును నొడి గట్టినవాఁడే.

అట్టి యవివేకసాహసముతో మంత్రస్రష్టలమని బయల్దేరిన ఋషింమన్యులు మొదలంటఁ జెడుట చూచుచున్నారము. వైదికమంత్రమే యైనచో స్వరప్రధానము. తాంత్రికమంత్రమే యైనచో బీజాక్షరప్రధానము. ఇది వైదికమంత్రమే యని తనక్రొత్తవాక్యములను స్వరపఱచఁగలఁడా? స్వరసంధానము చేసి పలికినను "ఇదెందులోని"దని ప్రశ్నించు వేదవేత్తలకు శిక్ష యిచ్చినవాఁడగును. సక్రమాధ్యయనము చేసినవారు సైతము "యథేంద్రశత్రుః స్వరతోఽపరాధాత్" అనునట్లు, స్వరాపరాధమగునేమో యను భయమునఁ ప్రాతిశాఖ్యముల సాయమును నిరంతరాభ్యాసమును గోరుచుందురు. ఇఁకఁ దాంత్రికమంత్రములను బోలి సృష్టింతుననుట సుప్తసర్పమును గఱ్ఱతోఁ గొట్టి మేల్కొల్పుటయు, నగ్నితో నాటలాడుటయు వంటిది.

మంత్రబీజములు నాదరూపములు. నాదమనఁగా బ్రహ్మశక్తి. "నారాయణీ నాదరూపా" (నామస్మృతి) ఆశక్తియే పరావాఙ్నామముతో మూలాధారమునందుండి సంకల్పము కలుగఁగానే నాదరూపముతో నాధారోపరిచక్రములందుచ్చ

రించును. ఉచ్చరించుట యనఁగా ప్రాణాపానవాయువుల చేరికతో విరాది విరాదికి లేచుట. ఆలేచునప్పుడే మూడు రూపముల నొందును. "నమామి తాం పరాం వాచం పశ్యంత్యాదిక్రమాశ్రియామ్। నానావిధమహాకారరసానుభవకారణామ్" (సౌభాగ్యహృదయము.) ఆరూపములు పశ్యంతీమధ్యమావైఖరులు. వైఖరీరూపమందే పరుల కర్ణేంద్రియములకందుటకు. అంతదానికన్నను రెండవస్థలమందు నుచ్చరించునప్పుడు, మొదటిది సంకల్పానుసారముగా నిర్వహణమెట్లులో చూచునది గాన 'పశ్యంతి.' పశ్యంతికిని వైఖరికిని నడిమి యవస్థ కావుననే మూడవది 'మధ్యమా', ఇది యితరులకు వినఁబడక పోయినను బ్రత్యేకపిండమందును లోన వినఁబడుచునే యుండును. (వీని విపులవివరణమును నా చండీపాఠవివరణము మధ్యమఖండమునఁ జూచునది) ఉచ్చారణము మూలాధారాది మూర్ధపర్యంతము నగును. ఈయుచ్చారమార్గమే సూక్ష్మరంధ్రవిశిష్టమగుటచేత "సుషుమ్న", సంచరించు నిల్లగుటచేత "కులము"; ('వసఁ ఋషికులేషు సః., ర.వం) ఈ కులమనెడి సుషుమ్నాభాగమందు సంచరించునది కావుటనే బ్రహ్మశక్తికి, "కులదేవత, కౌలినీ, కులయోగినీ" యనిపేరు. ఈ సుషుమ్నకు శ్మశానమనియు మఱొక పేరు. "శవానాం శయనం యత్ర - శ్మశానం" ప్రేతలుగా భావింపఁబడిన బ్రహ్మవిష్ణురుద్రులు శయనించుచోటు కావున శ్మశానము. ఆ బ్రహ్మాదులుండు చోటులే కులమందు గ్రంథులనఁబడును. ఆ చోటులను దాటుచు నాదరూపిణి బ్రహ్మశక్తి యుచ్చరించుటే గ్రంథిభేదనము. ప్రధానులు బ్రహ్మవిష్ణురుద్రులు సర్వదేవతలకుపలక్షణము. బంధువులను గూర్చినది

కావున "కులము". కుల్యతే బంధానితి కులమ్ = ఇల్లు. జగన్మాతకు దేవతలెల్లరు పుత్త్రాదిబంధువులు. పిండమందున్న బ్రహ్మశక్తివిశేషములన్నియు దేవతలే. వారు నివసించు నిల్లు కులము (సుషుమ్న) కావుననే షట్చక్రసంచయస్థానమైన యిదియే పరాశక్తిశరీరము (స్థూలము) నాదమే సూక్ష్మశరీరము. సాధకుండు మూలాధారాది సహస్రారాంతముగానైన చక్రముల యందు నాదరూప ప్రాత్మికాక్షరములను న్యసించుకొనుట యందలి భావపరమార్థమిదియే.

ఇక మంత్రవర్ణముల కాయాయి శక్తులెట్లు గలుగునో సంగ్రహించి విచారింతము మన శరీరమెట్లు పాంచభౌతికమో, నాదరూపశక్తి సంచరించు సుషుమ్నారూపశరీరము నట్టిదే. అందలి చక్రములు (అవేపద్మములు - గ్రంథులు) నైతము పాంచభౌతికప్రత్యేకతత్త్వవిశిష్టములె. శక్తిసంచారము నాదవిశిష్ట బీజాక్షరరూపముగా జరుగునపుడు ఆభౌతికశక్తివిశిష్ట స్థానములను దాకుచుండును. ఆ తాకునపుడు గల్గు స్పందన మందే యొక్కొక్క శక్తి విజృంభణమగును. ఆ స్పందనములు ప్రత్యేకశక్తివికాసముతో ప్రత్యేకఫలముల నిచ్చునవిగానుండును. ఈశ్వరసృష్టిలో స్థితి కనుకూలించునటులు పంచభూతములును, అన్యోన్యానుగ్రహ, అన్యోన్యోపకార, అన్యోన్యానుప్రవేశములు కలవైనను, వానిక్రమమును స్వస్థావస్థయు విషమించినపుడు విపరీతఫలప్రదములగుట బ్రహ్మాండపిండాండములందు రెంటను దప్పదనుట పాఠకులు మఱువరాని శాస్త్రసమ్మతరహస్యము. వీణాదండమందమర్పంబడిన సారెలవంటివే యీ సుషుమ్నయందలి గ్రంథులు (పద్మములు) వీణియ సారెలపైని వ్రేళ్లతో దాకుచుం దంత్రీస్పందనము గల్గించినపుడు, సప్తస్వరములలో, నేసారెను

పాడిన నేస్వరము పల్కునో తెలిసికొని పాడినప్పుడే, యా స్వరము శ్రుతిగోచరమగును. అట్టి జ్ఞానము లేనివాడు స్వేచ్ఛాముగా దంతుస్పందనము చేయునను వాడెలను పాడినపుడు శ్రుతి కటువులైన యపస్వరములు పుట్టి మనోక్షోభమును గల్గించును గదా. అటులే నాదసంచారమునందును ఉద్రేకపూరమైన మాతృకాబీజములు ఆయాయి చక్రములందాడుచుండిపోవునపుడును గలుగు స్పందనములు ఎంత ఎంత శక్తుల నుత్పాదించును. అవి తపస్సాధనబలమున నెఱింగికొన్న మహర్షులు బ్రహ్మలోకమందలి యనుగ్రహముతో, ఈబీజాక్షరములతో కూడి యీమంత్రమనియు, నీమంత్రముల నీచక్రములయందు అర్థమననముతో న్యసించి జపకాలమందు భావచ్యుతి లేనటులు చూచుకొనవలయుననియు శాసించిరి. కావుననే అది మంత్రశాస్త్రమైనది. పూర్ణముగా నుచ్చరించిన సంగీతమై ఖరీనాదము శాస్త్రోక్తముగా నిర్దుష్టరీతిని ప్రచారము చేసినపుడు వ్యాధిశమనము, వర్షకారకమేఘరంజనము మున్నగు విస్మయఫలజనకమునగుట మనము వినుచున్నాము. అనేకరాగముల నామములు ఆయాదేవతలకుఁ బ్రీతికరములగు నాదస్పందనములనుటను దెలుపును. అటులే పశ్యంత్యాద్యవస్థలలో నుపాసింపఁబడు మంత్రబీజనాదములును, అట్టి విస్మయజనకఫలదములే యని యెఱుఁగునది. మాతృకాక్షరములును భౌతికశక్తివిశిష్టములే గాన, భౌతికశక్తి విశిష్టములయిన చక్రములందు వాని స్పందనములగునపుడు విరుద్ధఫలజనకములు కానటులెంచి యనుభవించి, ఆయాదేవతలకుఁ బ్రీతికరములై యాయాదేవతల తత్త్వముఁ దెలుపు మంత్రములు ఆయా చక్రములందె భావించి జపింపవలయునని యామ్నాయముల నేర్పఱచిరి. కావున మంత్రసృష్టియందు మనకధికారము లేదు.

సృష్టించి దర్శించి యనుగ్రహాముతో మహర్షులిచ్చిన మంత్రములను ఏ గురువువల్లనో యుపదేశమందియు, ఆ మంత్రార్థము నెఱుంగకయే, మంత్రోద్దిష్టదేవతాతత్త్వము నెఱుంగకయే, వాని హృదయము నెఱుంగకే జపించుచున్న సాధకుల సంఖ్యయే యధికముగాఁదోఁచును. "స్థితస్య గతిశ్చింతనీయా" యని యున్నదాని తత్త్వమును ఉపాసాక్రమము నెఱింగి, స్తుత్యుక్త ఫలములఁ దొకవారినొందిననుంజాలు. సూత్నమంత్రిసృష్టికి నేను వెనుకఁజెప్పిన ఋషిత్వమనెడి యధికారమబ్బిన జన్మములో జూచు కొన వచ్చును. ఈయుపన్యాసమిప్పటికె పెరిగినది. ఉండనిండు.

కనుక సర్వాత్మదర్శియైన ఋషియై రెండవ మెట్టెక్క వలయును. ఆపిదప బ్రహ్మ—సృష్టిస్థితిలయకేంద్రస్థానము. ఈ స్థాన మందు జీవుఁడాధ్యాత్మికోన్నతియందు శివ మెట్టెక్కుచున్నాఁడు.

ఎంతదాఁకఁబరాంతకాలము (బ్రహ్మలీలావసానకాలము) కాదో, యంతదాఁక బ్రహ్మలోకమందే నివసించును. ఇమ్మాడు అలౌకికోన్నతులును ఒక్క 'నేను' అనెడి యాత్మయొక్క కామనలే. 'నేను' అనుదాని యిచ్ఛచేతనే యివన్నియు సంఘ టించునని యర్థము.

6. అహం రుద్రాయ ధనురాతనోమి బ్రహ్మద్విషే శరవ హంత వా ఉ। అహం జనాయ సమరం కృణోమ్యహం ద్యావా పృథివీ ఆవివేశ ॥

మున్ను బ్రహ్మద్వేషియు లోకహింసకుఁడునైన త్రిపు రాసురుని వధించుటకు నేనె మహాదేవుని వింటికి నారిఁగూర్చిన దానను. నన్ను స్తుతించువారి రక్షకై వారి శత్రువులతో నేనె యుద్ధము చేయుదును. నేనె భూమ్యాకాశములందంతట నంత ర్యామినినై నిండి యున్నాను.

వి॥ నేను బ్రహ్మజ్ఞానవిరోధుల నశింపఁజేయు రుద్రులను (ఏకాదశేంద్రియములను) గొట్టుటకుఁ బ్రణవమనెడి ధనుస్సునందు, ఆత్మయనెడి శరము నెక్కించెదను. మఱి నేనే నను నమ్మి కొలుచువారి కొఱకై వారి శత్రువులతో యుద్ధము చేయుదును. నేను సర్వభావములతోను స్వర్గమర్త్యలోకములందను ప్రవేశించి యున్నాను.

దశేంద్రియములు మనస్సు ననెడివే యేకాదశరుద్రులు: బ్రహ్మజ్ఞానవిరోధులు (ప్రథమమంత్రవివరణమందు జూచునది) ఇచట రుద్రశబ్దము ఏకవచనమందున్నది. ఇంద్రియవర్గము మనస్సునందంతర్గతము. మనసునునికితోడిదే యింద్రియసత్త. మనోలయముతోనె యింద్రియములు లయించును. మనసె యచట శరవ్యము. (కోలదెబ్బతో నశింపఁజేయఁదగినది. శర పాతయోగ్యస్థానము శరవ్యము.) శరవయను మూలమందు యకారలోపము ఛాందసము.

సాయణాచార్యులు 'శరవె' యనుదానికి హింస్రమని వ్రాసిరి. ఆయర్థమునుంగైకొనఁదగును. మనస్సు బ్రహ్మజ్ఞాన విరోధి గాన, దానిని హింసించుదానినిగాఁజెప్పిరి. ధనుశ్శబ్దమునకు అమ్మెక్కుపెట్టుట యనిరి. అందులకు "ప్రణవో ధనుఃశరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే" అను నుపనిషద్వాక్యమే ప్రమాణము.

ప్రణవ (మంత్ర) మనెడి వింటియందు యోధుఁడైన జీవాత్మ యనెడి యమ్మును దొడిగి బ్రహ్మము నుద్దేశించివిడిచినచో, దాని ఫలము మనోలయము. ఈమనసే రుద్రుడు. ఇదియె బ్రహ్మజ్ఞానవిరోధి. ఈమనసే 'నేను' అను దాని యఖండచైతన్యమును, ఖండజ్ఞానముచే జగదాకారముగాఁ

బరిణమింపఁజేయుచున్నది. ఇందుచే శరవ్యము మనస్సు. దీనిని 'హంతవే' అనఁగా హతము చేయుటకునై చేయఁబడు ధనుః శరసంధానము, యోగధారణాసమాధిపూర్వకజపహోమపాత్రార్థ నాదికమైన యుపాయము నవలంబించుటే యగును. ఆయుపాయ ములన్నియు నేనే. మొత్తమున సాధనరూపముగా నైతము నేనె ప్రకాశించుచున్నానని భావము.

తల్లి, మున్ను రుద్రరూపముతో నేనె ప్రకాశించు చున్నానని తన విభూతిం దెలిపి, యిచట మళ్లీ యారుద్రుని గొట్టుటకు నేనె పూనుకొంచున్నది. ఇది 'నేను' అనుదాని పని. జీవరూపముగాను జగద్రూపముగాను బంధనరూపముగాను నేనె యున్నాను; మఱియు నీబంధనమును ఛేదించి ముక్తినొందించు యోగసాధనరూపమంతయు నేనె. ముక్తియు నేనె యనుటే.

ఇచ్చట, అయిదు మంత్రములు చెప్పిన పిదప నీయాఱవ మంత్రమును జెప్పుటయందుఁగొంచెము రహస్యమున్నది.

ఎవఁడు సర్వవిధములచే నాత్మదర్శనము చేయ నభ్యసించినాఁడో — అనఁగా

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని।
సంపశ్యన్ బ్రహ్మ పరమం యాతి నాన్యేన హేతునా॥"

అనెడి యాశ్రుతివాక్యసాధనమం దెవఁడు సిద్ధినొందినాఁడో, వాఁడె రుద్రుఁడనెడి మనస్సును వినాశముచేయుటకుఁబైని జెప్పిన ధనుఃశరసంధానము పేరి యనుభవము నొంద సమర్థుఁడగును.

ఇకారణముచే మొదటి యైదు మంత్రములందును సర్వవిధముల నాత్మప్రకాశము వర్ణింపఁబడినది. తర్వాత నీమంత్ర మందు సర్వభావవిలయపూర్వకముగా నేకాత్మప్రత్యయమునకు సాధనరూపముగా నైతము 'నేను' నెడి యాత్మయే యుద్యుక్త

మైనదని వర్ణింపఁబడుట తేటపడినది. బుద్ధియోగధన్యుఁడైన వానికే యీయవస్థలు తఱచుగా ననాయాసముగా లభించును.

"అహం జనాయ సమదం కృణోమి" — 'నేను' (విశుద్ధచైతన్యస్వరూపాత్మయే) జీవునికొఱకై యుద్ధము చేయుదును. అనఁగా, ఎప్పుడు జీవుని ప్రాణశక్తి ఆత్మరాజ్యస్థాపనము చేయఁబూనుకొనునో, యపుడు మనసుమూలముగా నంతయు హరింపఁబడును. ప్రాణము భగవచ్చరణమందు సర్వస్వము సమర్పించి కృతార్థమగును; ఇఁక మనసో — సంసారవాసనలందుఁ గట్టిపెట్టును. ఇదె జీవజీవనముల శుభసంధిలక్షణము. అపుడె యుద్ధమారంభమగును. కురుక్షేత్రమందు (కర్మక్షేత్రమందు) ఈవిధమైన యుద్ధము సంఘటిల్లును. తరువాత, విజ్ఞానమయ క్షేత్రమందు — ఏదేవాసురయుద్ధము ప్రసగునో (యది చండీతత్త్వమందు వర్ణింపఁబడినది.) అది నేనె చేయుచున్నాను, చేసితిని. ఇందుచేత, సాధనక్షేత్రమందే యనుఁడు, విషయ క్షేత్రమందే యనుఁడు; అంతట నన్నికర్మములు నడుపునది 'నేను' అనెడి యాత్మయే యని భావము.

"అహం ద్యావా పృథివీ ఆవివేశ" — 'నేనె' ద్యులోకభూలోకములను బ్రకాశింపఁజేసి, యందంతటను బ్రవేశించి యంతర్యామినినై నిండి యున్నాను.

ఇందలి విశేషార్థము — దేవలోకము, విజ్ఞానమయ కోశము. దీనియందే యాత్మబోధ సమాప్తమైనచోఁ జైతన్యమయమైన బ్రహ్మసత్త కానవచ్చును.

భూలోకము అన్నమయకోశము. అనఁగా స్థూలదేహము. తక్కిన కోశము లీరెండిట నంతర్గతములు గానవానిని వేఱుగాఁ జెప్పలేదు.

ఆత్మకు అన్నమయకోశమేది? ఈవిరాట్స్వరూపమైన బ్రహ్మాండమే. ప్రాణమయకోశమేది? సృష్టిస్థితిక్రియాశక్తి. మనోమయకోశమేది? అనేకభావములతో వ్యక్తమగుటకైన సంకల్పమే. విజ్ఞానమయకోశమేది? విజ్ఞానమందీబహుత్వసంకల్పము౦చఁబడినదో యది. ఆనందమయకోశమేది? ఎచ్చోట నాత్మయొక్క స్వరూపము కేవలానందమయమై యుండునో యది. ఈస్థానమందే జగద్బీజము అవ్యక్తభావముతో నుండును. వీని యన్నింటి సమష్టి (విరాట్) విజ్ఞానమయకోశము. "విశేషేణ రాజత ఇతి విరాట్" ఇదె స్వర్గలోకము. జీవభావీయమై వ్యష్టియై విజ్ఞానమయకోశమందుండఁగల్గుటచేతనే, యితఁడు స్వర్గలోకమునకుఁబోవఁగల్గుచున్నాఁడు. మఱియు నసంఖ్యదేవదేవీదర్శనమును, అనేకప్రకారాత్మవిభూతులను బొందఁగల్గుచున్నాఁడు. శ్రీచండీతత్త్వమనునది యీవిజ్ఞానమయకోశసాధనమే. ఇది మున్ముందు స్పష్టపడును. ప్రతివ్యక్తియు దాను సంకల్పించినచో ఈక్షేత్రమునకుఁబోఁగలుగును. ఇది కేవలభాషాఝుంకారము కాదు; సత్యము. కావుననే దేవతాకృతస్తుతియందు "స్వర్గాపవర్గదే దేవి" యనుట. కావుననే జీవుఁడు సంకల్పబలముతోడి సాధనబలముచేత నీమహాలాభము నొందఁగలఁడనుట ముమ్మాటికి సత్యము.

7. అహం సువే పితరమస్య మూర్ధన్మమ యోని రప్స్వంతః సముద్రే। తతో వితిష్ఠే భువనానువిశ్వోతామూం ద్యాం వర్ష్మణోపస్పృశామి ॥

తండ్రియైన యాకాశమును గన్నదానను నేను. "ద్యౌః పితా" "ఆత్మన ఆకాశః సంభూతః" శ్రుతి. ఆకాశాదికార్యజాతమంతయుఁబరమాత్మనై సర్వకారణభూతనైన నాయందే,

నూలునందు వస్త్రమువలె భాసిల్లుచున్నది. భూతజాతమంతయు నాయందుఁగలుగుచున్నది గాన, సముద్రమనెడి పరమాత్మను నేను. ఆభూతజాతముల బుద్ధివృత్తులయందు వ్యాపించియున్న బ్రహ్మచైతన్యము నేను. ఇట్టిదానను గావుననే సమస్తభూత సంఘములందును బలువిధములుగా వ్యాపించి యున్నాను. దివ్యులఁగానవచ్చు స్వర్గలోకము మున్నగు వికారజాతమంతయుఁ గారణభూతమైన మాయా (బ్రహ్మశక్తి) రూపమైన నాశరీరమే.

"శ్రీగురుః సర్వకారణభూతా శక్తిః"

మఱియొక భావము — ఈభూలోకముకంటె వెలిని గానవచ్చు నాకాశము నావలనఁగలుగుచున్నది. సముద్రమందలి జలముల నడుమ నాకుంగారణభూతుఁడైన అమ్భృణుఁడను ఋషి యున్నాఁడు. సముద్రమున నంతరిక్షమందును, జలమయమైన దేవశరీరములందును బ్రహ్మచైతన్యమనై నేన యున్నాను. నేనే సర్వకారణాత్మికనై సర్వమందు నిండియున్నాను.

సారాంశమేమనఁగా — సముద్రము నాయోని (జన్మస్థానము). "సముద్రవంత్యస్మాద్భూతజాతానీతి సముద్రః" = పరమాత్మ. ఇతనివలన సమస్తభూతజాతములు వెలికి వచ్చుచున్నవి. ఇతని పై పై మఱల భూతజాతములు పరుగెత్తుచున్నవి. ఇతనియందే సమస్తభూతజాతములు నిమిడియున్నవి. కావునఁ బరమాత్మ సముద్రుఁడు. వేదమందుఁబరమాత్మ "సముద్రశబ్దముతోఁ బలుతావుల వ్యవహరింపఁబడును. "సముద్రాదర్ణవాదధిసంవత్సరో అజాయత" ఇట్టివెన్నో శ్రుతులు.

సముద్రమందు — అప్పు = అమృతమయములైన దేవ శరీరములందు, మూలకారణమైన బ్రహ్మచైతన్యమున్నది. దానినుండి నేను కారణరూపమునై వ్యాపించి యున్నాను.

దీని సారాంశమేమనఁగా, నేను జగత్పితను గన్నదానను "ద్యౌఃపితా" ఆకాశము తండ్రి. దాని మీదిభాగమున ఆనంద మయకోశము. లోపలనున్న విజ్ఞానమయకోశమందు నాకారణ శరీరమున్నది. నేను సమస్తభువనములందును జొచ్చి యున్నాను. దూరముగానున్న యాస్వర్గలోకమును గూడ నాశరీరముతోఁ దాకుచున్నాను, అన్నది.

ఓ॥ జగత్పిత — హిరణ్యగర్భుఁడు. ఎవనివలన నీజీవ జగత్తు గల్గినదో వాఁడు. ఇదె పరమాత్మయొక్క మనోమయ కోశము. కావుననే, "బహుస్యా"మ్మనెడి సంకల్పమునకు మూలమైనది (సంకల్పస్థానము). పృథివి మున్నగు నైదు భూతములందును మొదటిది యాకాశము. ఆకాశము = అంతటఁబ్రకాశించునది. ఇది వ్యోమతత్త్వము. వ్యోమము = అంతటినావరించి యున్నది. అన్నియుఁదనయందుండుట కవకాశమిచ్చి రక్షించునది యని యర్థము. హిరణ్యమనఁగా వెడలి పోవునది యనియు, ప్రకాశించునది యనియు నర్థము, తనలో నిమిడియుండి, జ్ఞానరూపప్రకాశముగల, వెలికి వచ్చు స్వభావము గల జీవకోటిని మ్రింగి యున్నవాఁడు (= కడుపునఁగలవాఁడు) నగుటచే హిరణ్యగర్భుఁడయినాఁడు కావున నాకాశతత్త్వమే హిరణ్యగర్భుఁడు. ఆకాశతత్త్వమునకుఁబైది మనస్సు. కనుకనే షట్చక్రములందు, ఆకాశతత్త్వవిశిష్టమైన విశుద్ధమునకుఁబైదయి, భ్రూమధ్యగతమైనదే మనస్తత్త్వవిశిష్టమైన యాజ్ఞాచక్రము. ఇచ్చట ననుసంధానము చేయునపుడే పరశివునుండి వచ్చు

నాజ్ఞలను సాధకజీవుడు గ్రహించును గాన ఇది 'ప్రాజ్ఞ' యనఁబడినది. మనస్సునందే నానాభావాభిప్రాయముల సంకల్పము లున్నవి. మనము మనస్సునందె యనేకవిధములయిన సంకల్పముల నెటులు చేయుచున్నామో, యటులే విరాణ్మనఃసంకల్పములే బ్రహ్మాండములు. మన మనస్సంకల్పములు క్షణస్థాయులును నితరులకుఁగానరానివి. ఇట్టి మనోమయుడైన పరమాత్మ సంకల్పములు గొప్పవియు దీర్ఘకాలము నిల్చునవియు నితరులకు భోగ్యములునునై యుండును. ఈవిరాట్పురుషుని పేరె హిరణ్యగర్భుఁడు. ఇతఁడే జగత్పిత. ఈసచ్చిదానందస్వరూపాత్మను నేనే కన్నాను. వాని జననిని.

"అస్య మూర్ధన్మమ యోనిః" — దీనికి మీఁది భాగమున నాకారణదేహమున్నది. ఇదెక్కడనగా "అంతఃసముద్రే అప్సు" = సముద్రమునందున్న జలములయందు. సముద్ర శబ్దమునకర్థము ఆనందము. ధాతుప్రత్యయముయొక్క యర్థమును బట్టియు సముద్రశబ్దమున కానందార్థము వచ్చును. సమ్ పూర్వకమైన క్లేదనార్థకమైన ఉద్ ధాతువునుండి సిద్ధమైన మాటయే సముద్రము. ఉదీ క్లేదనే, మిక్కిలి క్లేదమును బొందునది — అనఁగా వృద్ధినొందునది. మఱియు "సమంతాన్మోదం రాతీతి సముద్రః" అంతట సంతోషమును గలిగించునది. కనుకనే "రసో వై సః" "ఆనందో బ్రహ్మ" యనియు శ్రుతులు. రసమే జలము; ఆరసమే ఆనందము; ఆనందమే బ్రహ్మము.

అప్ శబ్దమునకు వ్యాపనశీలనమైన ధీవృత్తి. సాయన భాష్యమందునుంగలదు. బుద్ధివృత్తికే విజ్ఞానమయకోశమని పేరు. పూర్వమంత్రమందు, ఆత్మయొక్క పంచకోశములు వివరింపఁబడినవి. ఉండగా ఈమంత్రమునకు మనమెఱింగిన యర్థము.

— ఆనందమయకోశములోపలి విజ్ఞానమయకోశమే హిరణ్యగర్భుని మీఁదుగానున్నది. అదె 'మమ యోనిః' పరమాత్మ యొక్క కారణశరీరము.

జీవుని కారణశరీరముగూడ, ఆనందమయకోశమనుపేరఁ బ్రసిద్ధమైనను కేవలానందమయకోశమే కారణశరీరము కాదు. దాని లోపలనుండు విజ్ఞానమయకోశమే యథార్థకారణమగుచున్నది. విజ్ఞానమే యీజగత్తును ధరించుచున్నది, ఇది తటస్థుఁడైన సాక్షివలెఁగానవచ్చుట మాత్రమే; దాని ఈక్షణము — "స ఐక్షత" అని శ్రుతి. ఈక్షణము, సంకల్పము, చికీర్ష అనునవి సమానార్థకములు. ఆయీక్షణముతోఁ (ప్రకాశము) జేరుట చేతనే ప్రవృత్తిరూపమైన యీమనస్సు, అనంతవైచిత్ర్యములతో నిండిన యీజగత్ప్రపంచరచనమును జేయుచున్నది. ఈకారణముచే, హిరణ్యగర్భుని (జగత్పిత) యొక్క మీఁది భాగముననే ఆత్మయొక్క కారణశరీరమున్నది యని తెలియవలయును.

"తతో వితిష్ఠే భువనాని విశ్వా" — కావుననే సమస్త భువనములందును 'నేనే' ప్రవేశించి నెలకొని యున్నాను.

"ఉత అమూం ద్యాం వర్ష్మణా ఉపస్పృశామి" ఏది సాధారణజీవుల పక్షమున, దూరవర్తియైన స్వర్గలోకముగాఁ నెన్నఁబడుచున్నదో, ఏది విజ్ఞానమయకోశమనుపేరఁజెప్పఁబడినదో, అస్థానమును సైతము నేను నాశరీరముతోఁదాకుచున్నాను. సారాంశమేమనఁగా — సమస్తబ్రహ్మాండములును సచ్చిదానందస్వరూపమైన నాశరీరమే. ఆద్యులోకమునకు (విజ్ఞానమయకోశమునకు) ఆరోహింపఁగల్గితిమా, ఆ 'నేను' అనుదాని స్పర్శానుభవము చేయఁగలము. ఇదె, యీవాక్యముయొక్క విశేషతాత్పర్యము.

8. అహమేవ వాత ఇవ ప్రవామ్యారభమాణా భువనాని విశ్వా। పరో దివా పర ఏనా పృథివ్యైతావతీ మహినా సంబభూవ ॥

కార్యరూపమైన సమస్తభూతజాతములను నేనే కారణమనై పుట్టించుచున్నాను. ఇతరుల ప్రేరణ మొక్కటి లేకయే గాలి స్వేచ్ఛమై ఎటులు వీచుచున్నదో, యటులే నేను ఒరుల ప్రాపు లేకయే ప్రవర్తింతును. ఈయాకాశాది వికారజాతమును నేనే పుట్టించి, యాసర్వముకంటెఁబరమందు వర్తించుచు దేనిని నంటక యుదాసీనకూటస్థ (వికారములు లేక నిశ్చలమై యుండి, వికారములు లేక నిరవధికకాలముండునది) బ్రహ్మచైతన్యమైన దాన 'నేనే' ఇట్టి మహిమముతో నెంతటనున్నాను. "అతతి సర్వత్రేత్యాత్మా" అంతట వ్యాపించి యుండునది గాన ఆత్మ.

వి॥ ఇచ్చట స్వేచ్ఛాసంచారముగల వాయువు దృష్టాంతముగా నీయఁబడినది. "పరో దివా" యనునపుడు, అధః అధస్తాత్ అనునటులే 'పరస్తాత్' అని గ్రహింపవలయును. పృథివ్యాకాశములకుఁబరముగా, సమస్తభూతవికారజాతము కంటెను మీఱి యుండుచు అసంగత్వముతో (దేనినంటకే) యనియర్థము. 'మహినా' యనునపుడు (మహిమ్నా) మ లోపము ఛాందసము.

వాయువువలె నేనెపుడు స్వేచ్ఛతోఁబ్రవర్తింతునో, యపుడే యీసమస్తభువనముల సృష్టియుఁబ్రారంభమగును. ఈస్వర్గమర్త్యములను మీఱి నేనున్నాను. ఇదె నాగొప్పతనమున్నది.

ఇచట వాయువువలెఁబ్రవహించు స్వభావముగలది యను మాట, బ్రహ్మచైతన్యముయొక్క క్రియాశక్తిని దెల్పును.

భూతములందు ఆకాశము క్రియాహీనమై, ఉదాసీనమై సర్వాధారమై యున్నది. వాయువో, ప్రవాహరూపక్రియాశక్తిమయము. గీతయందు

"యథాకాశస్థితో వాయుర్నిత్యం సర్వత్రగో మహాన్ ।
తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ ॥"

అంతటఁ బ్రవహించునదియు, మహాబలవంతమును, గొప్పదియునైన వాయువు ఆకాశమందెటులున్నదో, యటులే సర్వభూతములు నాత్మయందున్నవి. ఎపుడు జీవుఁడీయాత్మవస్తు సాక్షాత్కారమునకై యవసరపడునో యప్పుడిది క్రియాశక్తి విశిష్టమగుటను గాంచుచున్నాము ఎపుడు ఉటస్థలక్షణముతో మన సమీపమందుండునో, యప్పుడు యథార్థముగా నిదే వాయువువలెఁ బ్రవహించు శీలము గలదగుచున్నది. కావుననే వేదాంతసూత్రములందు "జన్మాద్యస్య యతః" అని బ్రహ్మజిజ్ఞాస కుత్తరమిచ్చినాఁడు.

దేనినుండి యీసమస్తజగత్తునుంబుట్టినదో, దేనియందు నిల్చియున్నదో, మఱల దేనియందుఁజేరిపోవుచున్నదో యదియే బ్రహ్మము. (ఎప్పటికప్పుడు వృద్ధినొందునది) అదె యాత్మ — (అంతట వ్యాపించియున్నది.) అదె "అహమ్" (అస్య చ హస్య చ సమాహారః అహమ్) (అ = బ్రహ్మము, హ = శక్తిః, శక్తియుతబ్రహ్మేత్యర్థః).

అహమ్ = నేను, అనఁగా నేమో తెలియఁగోరువారికి ఒక్క "జన్మాద్యస్య యతః" అను సూత్రమే యుత్తరము. ఇంతకంటె సరళమైన వాక్యము మఱి లేదు.

జగత్ప్రసవ — పాలన — సంహారములను జేయు శక్తిరూపజననిని 'నేను'.

ఇందుచేతనే మంత్రమందును 'ఆరభమాణా' యని స్త్రీలింగశబ్దమే ప్రయోగింపఁబడినది. ఈజననియే జీవులకెల్లను సాధ్యవస్తువును, ఉపాస్యమును నై యున్నది.

ఈసమస్తభువనములు నెంతవఱకు నిల్చునో, ఎంతదాఁక నిది (నేను "ఆరభమాణా") అనఁగా క్రియాశక్తి రూపముగా నుండునదే, ఇది స్త్రీలింగమైన మాట. (భావము)

నిర్గుణభావముతోనే యుండును; పురుషభావముతోనే కానిండు; ఉపాసనవ్యాపార మెంతవఱకుండునో, యంతవఱకు నాత్మ క్రియాశక్తి (మహామాయా) రూపముతోనే ప్రకాశమానమగుచుండును.

ఇదే గాక 'నేను' అనుదాని మఱియొక యవస్థ కలదు. సూక్తము నుపసంహరించుచుఁజెప్పఁబడుచున్నది "పరో దివా పర ఏనా పృథివ్యై ఏతావతీ మహినా" ద్యులోకభూలోకములను వ్యాపించి, యాద్యులోకభూలోకముల (ఇవి సర్వలోకములకు నుపలక్షణములు) రూపమైయే 'నేను' అనుదాని స్వరూపము చెప్పఁబడినదో, దానికి వెలుపలను (ఉపరిభాగమందును) ఆ 'నేను' ఉన్నది. అది మాటలకును మనస్సునకును అందదు. అదె జీవునికి గమ్యము (పొందఁదగినది) లక్ష్యము (గుఱించి యుపాసింపదగినది) నునై యున్నది. అది జగములనన్నిటిని మీఱి, నిరంజనమైన (దేని నంటని) స్వరూపమగుటవలన, దాని మెట్టిమహిమయుఁదెలియ బడదు. దానినే గీతాగురుఁడు "న సత్తన్నాసదుచ్యతే" అని నిర్వచించినాఁడు. సారాంశమేమనఁగా — "నేను" అనుదాని మహిమ యీజగత్తు — ఈజగత్తుల వ్యాపించియున్న విరాడ్దేహము. వేదాంతసూత్రములందును నిత్య (త్రికాలములందును

బాధలేని) నిరంజన (దేనినంటని) స్వరూపమును, అఖండితము గానే యుంచి, 'నేను' (తల్లి) తన స్వయంపరిచ్ఛిన్నమైన, జీవ జగదాకారములోఁ బ్రకాశించుచున్నది. ఇదె యాశ్చర్యకర మును, ఇదె యథార్థమునైన 'నేను' యొక్క మాహాత్మ్యము.

ఈ 'నేను' అనుదాని మాహాత్మ్యమును, అతికష్టంపడి యనుభవింపఁగలిగినపుడే మనవి సార్థకజీవనములగును. కావున నో సాధకులారా! జీవులారా! మనమింతదాఁక ఏ 'నేను' అను దానిని గంటిమో, యిపుడు కనుచున్నామో, ఆమాతృస్వరూ పముయొక్క మేరలేని యుదారస్నేహవికాసము — అట్టిదిట్టిదన రాని సంతానవాత్సల్యము — అలౌకికమాహాత్మ్యము — మన వంటి కృతఘ్నసంతానముపై నెటులు బ్రసరింపఁజేసినదో, చూడుఁడు కనువిచ్చి; మ్రొక్కుడు మనసులిచ్చి; అమృతు లరగుఁడా శ్రీమాత యొడిని జొచ్చి.

ఈనుడుల తత్త్వమెఱిఁగి పర్వెత్తి పోయి
యమ్మ యొడిలోనఁబడితివా, యపుడె నీదు
జాగత క్రీడనైన కశ్మలము తొలఁగ
జలకమాడించు నమృతవర్షమున నిన్ను.

దేవీసూక్తరహస్యబోధమె సుఁడీ దివ్యాంజనంబై, పున
రావృత్తింగననీని నిత్యసుఖసోఽహంభావసాధమ్మునన్
జీవుంజేర్చు; నదే సమాధి యను చణ్డీమాతృమృద్వంకని
త్యావాసంబదె ముందు గ్రంథము; కనుండత్యాదృతిన్ సాధకుల్.

ఇది

శ్రీకాకుళవాసి, హారితసగ్రోత్రుఁడు, శ్రీ శివానందనాథాపర నామకుఁడు, ఈశ్వరసత్యనారాయణశర్మ వ్రాసిన
శ్రీదేవీసూక్త పరమార్థవివరణము.



శ్రీ మాత్రే నమః

# సోఽహమ్ (సమాధి)

## వాఁడే నేను (ఆపరమాత్మయే నేను)

ఎన్ని చదివినను, ఎన్ని వినినను, ఎంత యోజించినను అద్వైతమతానుయాయుల లక్ష్యమీభావమే; గమ్యమీభావమే.

సమాధి యనెడి పట్టున, సాధకులనేకులు భాషాఝంకార పూరితములైన వాక్కులను జదివియు వినియు సమాధితత్త్వ విషయమున భ్రమపడి ప్రమాదములకు లోనై సమయశ్రమములను వృథ చేసికొనుచున్నటులు గ్రహించుచుందును.

నా శిష్య యొకర్తె, శ్రీమతి యువతి, శ్రీవిద్యాదీక్ష గొన్నది. ఉపాసనాతీవ్రత గల భాగ్యశాలిని. ధ్యానస్వప్నతదితర కాలములందుఁదనకగు ననుభవముల నెప్పటికప్పుడు నాకుఁ దెలుపుచుండును. నేను శిష్యులు వ్రాయు జాబులలోని మాటలను శ్రద్ధతోఁ జదివి, వారి యాధ్యాత్మికోన్నతిని గుర్తించుచు నొందు నానందమే ఫలముగాఁ గనువాఁడనౌట, వానికి బదుళ్లు విసువక వ్రాయుచుందును. ఈ నడుమ నాబిడ్డ యొక ధ్యానవేళానుభవమును వ్రాయుచుఁ దానొందిన యవస్థకు "సమాధి" యను పేరుపెట్టి, యింకేమేమో వ్రాసి "నా యీ యవస్థానుభవమును గూర్చి నన్నుద్బోధింపుఁ"డని కోరినది. ఈబిడ, అనంతపుర మండలమందలి తాడిపత్రి గ్రామవాసిని.

నేనును, బదులు వ్రాయఁబూనియు, నా వ్రాత యిప్పుడామె కొక్కర్తకే గాక, అంతమాత్రపుటధికారము గల నా శిష్యబృందమునకంతటికి నుపయోగించునటులుండఁదగునని యెంచి "సోఽహమ్ — సాహమ్" సమాధి — యను సాధనావస్థావిశే

షమును గూరిచి విపులముగా యథ సుభూతముగా వ్రాసితి, నదియే యిది. సాధకులారా! మీ సోదరి సౌభాగ్యవతి సరోజమ్మ వ్రాతకిది బదులు. శ్రద్ధతో జదివికొని, ఏపాటియేని మీకాలాభమున కగునేమో చూడుడు.

అమ్మా! సరోజా! శ్రీ శంకరాచార్యకృత సౌందర్య లహరి, నా యాంధ్రానువాదముతో నీకు కంఠస్థము; నే నెఱుంగు దును. అందలి —

"భవాని త్వం దాసే మయి వితర దృష్టిం సకరుణా
మితి స్తోతుం వాంఛన్ కథయతి భవాని త్వమితి యః।
తదైవ త్వం తస్మై దిశసి నిజసాయుజ్యపదవీం
ముకుందబ్రహ్మేంద్రస్ఫుటమకుటనీరాజితపదామ్"॥

అను శ్లోకసారము ననుభవమునకుం దెచ్చుకొనుచున్నావా? బాగు! బాగు! అదే త్రోవ; తప్పిపోక నడువునడువుము. "మంత్ర గురుదేవతాత్మమనఃప్రాణానామైక్యనిష్పాలనాదేవ సర్వసిద్ధిః" యను కల్పసూత్రమునర్థము నీమనసున గట్టిగా నంటినదన్నమాట. దాని నన్వర్థము చేయుచున్న నీ యీ త్రోవలోనే యోగాంగము లన్నియు సిద్ధమై పోఁగా, నీవశ్రమమున గమ్యముంజేరుదువు.

ఇఁక నీనాువ్రాతలోని పారిభాషికములు, మున్ను నీకెన్ని సారులో వివరించినవే. పలుసారులు చదువుకొని సందేహములున్న తావులను గుర్తించి మోమోటమి వీడి మఱి యడుగుము. ఇంతేలమ్మా! సంకల్పములోనే, "తల్లీ! తమోహారిణీ! మబ్బులు తొలఁగింపు"మని మఱి మఱి వేడికొని చదువం బూనుకొమ్ము. సకలజనని సానుకంపయై, యిందునుగూర్చి మఱల నాకు వ్రాయ నీయకయే సాయపడి నిన్ను దన యొడిలో నిల్పికొని ముద్దాడును.

ఇఁకఁజూడుఁడు. ప్రకరణ మారంభింతును. అనేక జన్మార్జిత సుకృతఫలముగా జీవునికి సమాధిసంధానలాభ మగును. జాగ్రత్స్వప్నసుషుప్తులనెడి మూడవస్థలును సాధారణ జీవులెల్లరు ననుభవించుచున్నవే. ఈ మూడునుగాక మఱియొకటి యున్నది; దాని పేరే తురీయము (నాలవది) సమాధి. ఎక్కడనో ఒక్కొక్క జీవుఁడు దాని (సమాధ్యవస్థను) బొంది ధన్యుఁడగుచున్నాఁడు.

ఏ యవస్థయందు మనోబుద్ధి చిత్తాహంకారములు, పంచ జ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు అను నీ పదునాలుగును దమ తమ పనులు చేయుచుండునో, యది జాగ్రదవస్థ.

ఏ యవస్థయందు నాలుగంతఃకరణములు పనిచేయుచుఁ దక్కిన పదియు నిష్క్రియావస్థయందుండునో, యపుడు స్వప్నావస్థ యందుము.

ఏ గాఢనిద్రావస్థయందు (సుషుప్త్యవస్థ) మనలనే మనము మఱచి (యెఱుకలేక) యుందుమో యపుడు ప్రాయశః మృతవదవస్థ (శవమువలెఁ బండియుండు నవస్థ). అపుడంతఃకరణ వృత్తులుండవు; నేనేమియు నెఱుఁగననెడి యవస్థ. ఇదే సుషుప్తి.

కాని నాలవది యగు సమాధ్యవస్థయందట్టులుకాదు. అపుడు జాగతికజ్ఞానముండదు. అనఁగా నింద్రియములచేఁ దెలియఁదగినవి తెలియఁబడవు. అయినను ఆత్మసత్త జాగరితమై యుండును. అనఁగా జగద్భావముల సంబంధమింతయు లేని నిద్ర; యైనను ఆత్మభావముతో జాగృతుఁడే. దీని పేరే సమాధి.

బుద్ధియోగ ఫలముగాఁ జైతన్యమను మహాకాశమండలమందు, (చిద్గగనమందు) ఉండుట యలవాటుపడిన వెనుక, నీ యవస్థ తనంతటనే వచ్చును.

ఇదే యాత్మరాజ్యమందు (తల్లియొడిలో) జేరుటకైన ద్వారము. మాతృస్నేహరసాభిషిక్తుఁడై భక్తిధనముచే గురు నకారణకృపాధనముచే జ్ఞానవంతుఁడై, అపారసత్యప్రతిష్ఠా శక్తిచే వీర్యవంతుఁడై, బుద్ధియుక్తకర్మఫలముచేఁ జిన్మయ జ్యోతిర్ధనముచే ధనవంతుఁడై యుండునో, ఆ ధనవంతునియందే సమాధిభోగము వెలయును. ఆధనవంతుఁడే సమాధిరాజ్యాభిషిక్తుఁడగును.

సమాధి:— అష్టాంగయోగములందుఁదుది యంగము. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులనెడి యెనిమిదియు యోగాంగములని యోగశాస్త్రము. ఇవి కేవలభగవత్ప్రాప్తి విషయమందే యుపయోగపడు ననరాదు; సరి గదా; యోగము లేక యెట్టిజాగతికకార్యమును సిద్ధింపదు. యోగమనఁగా నొకదానితోనొకటి చేరుట. ఇంద్రియములతో విషయములే యనుము; మనసుతో బుద్ధియే యనుము; బుద్ధితో నాత్మయే యనుము; ప్రత్యగాత్మతోఁబరమాత్మయే (భక్తులతో భగవంతుఁడే) యనుము; లేదా మాతతోఁబుత్రుఁడే యనుము; ఇవన్నియు యోగపదవాచ్యములే. ఈ యోగము మును జెప్పిన యమనియమాదులైన యెన్మిదింటి సమష్టియే. విషయేంద్రియయోగము పేరే కర్మము. కనుకఁగర్మమే యోగము. జీవుఁడే యోగి. మహాయోగిని, యోగమాయ యైన మన యమ్మయొక్క కల్పితప్రత్యేకపరమాణువుకూడ నీమహాయోగముతో సదా యుక్తమే. మహాయోగియైన మహేశ్వరుని హృదయమందు విహరించు మహాయోగేశ్వరితో యోగచ్యుతి (సంబంధవిలోపము) యయ్యేనేని, బయలనెగురు పరమాణుపర్యంతము నిల్చి యుండలేదు. పూర్తిగా

సమ్మతిఁజేరి పోవునపుడు (మహాముక్తినొ) ఈయోగమునకు సమాప్తి. కడచిన యీయుగమందు, ప్రథమమైనట్టిప్రకార మునాఁడీయోగము మొదలయ్యెనో, దీని సమాప్తి యెప్పుడో మహాయోగేశ్వరులైన మన యమ్మకే తెలియును. ఇపుడు మనము చూడవలసినదేమనఁగా — "కర్మసు యోగమెట్టులగు" నన్నది.

సరోజా! నీవు భోజనము చేయుచున్నావనుకో. అపుడు నీ చిత్తమును దదితర కార్యములనుండి, యావశ్యకతను బట్టి కొంచెము లోఁబఱచుకొన (అడ్డగింప) వలసి వచ్చును — దీనికే యమమని పేరు.

నీవు తిండి తినువేళ, ముందుగాఁ గాలుసేతులు కడిగికొనుట, పీట వేసికొనుట, మడుగులు గట్టుకొనుట, అన్నాదుల నిటునటు సరదుకొంట మున్నగు కొన్ని యావశ్యకములను నియతముగాఁబాటింతువు. ఇదే నియమము.

ఏవిధముగా నీవు కూర్చుండిన నీభోజనము చక్కఁగా సుగముగా సాగునో యాప్రకారముగాఁగూర్చుండుటకే ఆసనమని పేరు. పరుగెత్తునపుడును బండుకొన్నపుడును, నెటులు నీశరీరన్యాసముండునో యటులున్నచో నీభోజనము సరిగా జరుగదు. అంతే గాక, యేపని చేయునపు డేవిధముగాఁగూరు చున్న నాపని సుఖకరముగా సాగునో, యటులు కూరుచుండుటే, ఆసనము.

తరువాత — ప్రాణాయామము. ప్రాణముల ఆయామము ప్రాణాయామము. ఆయామమనఁగా విస్తారము. సాధారణముగాఁ బ్రాణాయామమనఁగా నే శ్వాసప్రశ్వాససంయమమనియే యందుము. మనము చేయు వేర్వేఱు పనులందు శ్వాసగతిపరి

మాణము తారతమ్యము నొందుచుండును. ఏకార్యమందుఁ బ్రాణప్రసారమగునో, యాపని చేయువేళ, శ్వాసగతి తదనుసారముగా మృదుభావము నొందుచుండును. ఏకార్యము చేయునపుడు ప్రాణము సంకుచితమగునో, ఆకార్యవేళనది (గతి) తీవ్రత నొందుచుండును. ఏకార్యమందుఁ బ్రాణమెంతదాఁక సంకోచమునో ప్రసారమునో పొందుచున్నదో, సాధకులు గుర్తించుచుండవలయును. అట్టి లక్ష్యమునుంచియే పూర్వాచార్యులు పుణ్యపాప, విధినిషేధవ్యవస్థచేసిరి. ఏవిధముగాఁబని చేయుటచేఁ బ్రాణము స్వభావముచేఁబ్రసారితమగునో దానినే శాస్త్రమందుఁబుణ్యరూపముగా వర్ణించిరి ఇదియే విధినిరూపిత కర్మము. మఱి యేపని చేయుటచే సంకుచితమై నడుచునో, దానినె శాస్త్రకారులు పాపకర్మమనిరి. అది నిషేధించిరి. పాప పుణ్యములు విధినిషేధములు నీప్రాణాయామతత్త్వముపై నే నిల్చి యున్నవి. (ఆయామము = దీర్ఘముగా నెమ్మదిగా సాగుట. సంకోచము = హ్రస్వముగా దగ్గరదగ్గరగా శ్వాసము నడుచుట.)

అది యటులుండనిమ్ము. ఇపుడు ప్రస్తావించిన భోజన కార్యమందు సైతము, నిటులే స్వాభావికప్రాణాయామము యొక్క తారతమ్యము నిత్యసిద్ధము.

ప్రత్యాహారము:— ఇంద్రియవృత్తులను ఇతరవిషయము లందుఁ బోనీయక యడ్డగించి, యభీష్టకార్యమందే తగిల్చి యుంచుట పేరే ప్రత్యాహారము. ఆహారకార్యము పూర్తిచేయుట యందును నీప్రత్యాహారము కొంత యత్యావశ్యకమే కదా.

ధారణము:— తిండి, దానివలని తృప్తి, ఆఁకలి యడఁగుట యనువానియెడ ధారణ చేయఁబడుచునే యుండును.

దీనివలన క్షుధానివృత్తియుఁ దృప్తియుఁగాఁగానే భోజనము నెఱ వేఱినట్లగును.

ఈవిధముగా, భోజనము విషయమైన కొంతధ్యానము (చింత)ను, అందువలనే యత్యల్పముగా క్షణమాత్రమే యైన సమాధియు నొందునే యుండును. అనఁగా క్షణకాలము మనసు, ఆజ్ఞాచక్రమును దాకి మరలుచుండును. దాని ఫలముగానే భోజన కార్యము నెఱవేఱుచుండును. ఇట్లే యన్ని పనులయందుననని యెఱుంగునది.

మన పనులయందన్నిటను, లోపల మనకుఁదెలియఁ బడకయే, అష్టాంగయోగసాధన జరుగుచుండును. సాంసారికము లైన పనులయందన్నింట మనకిట్టి యలవాటయియే యున్నది, యైనను, ఇంత తంతు నడుచుచున్నదని మనము గుర్తింపలేకు న్నాము. అయినను ఈయెనిమిది పనులు నొకదానివెనుక నొకటి యవ్యవధానముగా సిద్ధమగుచున్నవి. పద్మపత్రశతవేధన్యాయ ముగా, అనఁగా నూఱు తామరపూరేకులను దొంతి పెట్టి సూది గ్రుచ్చునపుడు, ఒకదళము వెంట నొకటి వేధింపఁబడుచున్నను, ఒక్కప్రయత్నముతో నొక్కసారియే వేధయగుచున్నటులు తోఁచినను, ఇవన్నియు నొక్కసారిగా వెనువెంట నడుచుచున్నవని తెలియవలయును.

కనుక సమాధి లేక యెట్టికార్యమును నెరవేఱజాలదు. మనసు నిశ్చయరూపవృత్తి యనెడి బుద్ధియందు నిల్చి చక్కఁగా సంస్థాపితమగునపుడే సమాధి కలుగుచున్నది.

నీ కాలియందొక ముల్లు గ్రుచ్చుకొన్నదనుకో. అపు డింద్రియములు ములు గ్రుచ్చుకొనుట యనెడి కార్యమును మనస్సమీపమునకుఁగొనిపోవును, గాని మనస్సు, అదియేమిటో

చెప్పలేదు, గాన నది మఱల నిశ్చయాత్మకబుద్ధి చెంతఁజేర్చును. ఈచేర్చుట యనునదే సమాధి. ఇపుడు మనసు ఆజ్ఞాచక్రమందు బుద్ధితోఁజేరి పోవును. అపుడు బుద్ధి "ఇది ముల్లు గ్రుచ్చుకొనుట" యని చెప్పివేయును. అపుడే కొంచెము నొప్పి తోఁచును. అపుడే మనస్సు "ఉస్స్, అమ్మా!" యనుచు, చాల నొప్పి యగుచున్న దనుచు, ముల్లు గ్రుచ్చుకొనుటచేనైన యాతన ననుభవించును. ఇటులే యంతటనని తెలియుము. ఇదే మనోబుద్ధుల యోగమనెడి సమాధి. ఇదే సాంసారికములయిన సర్వకార్యములకును మూలము. ఇట్టి సమాధిని జీవుఁడు రేవగళ్లు విడువక చేయుచునే యున్నాఁడు. ఇందుచే, దాని యంగములైన యమనియమాదుల యెన్మిదిటి యోగమును, స్వభావముతోనే సిద్ధము అయిన నిట్టి సమాధి సమాధి కాదు. ఏమన నిది మానసికసంస్కారములతో నిర్భరమై యుండును. ఇక వాస్తవికసమాధి యనఁబ్రజ్ఞతో (బ్రహ్మముతో) జేరుట. "ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ" యనెడి ఋగ్వేదీయవాక్యప్రమాణానుసారముగా, ప్రజ్ఞానమే బ్రహ్మము.

ఎపుడు మనస్సు ప్రజ్ఞానాకారముగా నాకారితమగునో (అనఁగాఁబ్రజ్ఞయందు విలీనమగునో) యపుడే యథార్థసమాధి యేర్పడును. ఇది తొలుదొల్త జ్ఞాత (తెలియువాఁడు), జ్ఞానము (తెలివి), జ్ఞేయము (తెలియఁదగినది) యను త్రిపుటితోఁగూడి యుండి, సవికల్పరూపముగా నావిర్భవించును. తర్వాత అమ్మ కృపచేతను, అభ్యాసబలముచేతను నిర్వికల్ప (త్రిపుటీరహితము) రూపమై కేవలవిశుద్ధబోధరూపముతోఁ బ్రకాశించును. దీనినే యసంప్రజ్ఞాతసమాధి యందురు.

సమాధియే ఆత్మను జేర్చు దారి. అఖండజ్ఞానసముద్రముచేఁ గల్పితజీవభావము నొందిన పరిచ్ఛిన్నచైతన్యము చేరుటకైన ప్రణాళికయే సమాధి. ఎల్లప్పుడును చైతన్యజీవునందు దీని యావిర్భావతిరోభావములగుచున్నను, ఎంతదాఁక దానిని ప్రత్యక్షము చేసికొనఁడో, అనుభవింపఁడో, యంతదాఁక జీవుఁడు జననమరణదుఃఖకష్టశోకతాపములను దూరముగాఁ ద్రోసి వేయలేఁడు.

ఆత్మదేవో మన సమాధిరూపమును దెలిసి ప్రేమమయ సంతానమైన జీవుని, ఆత్మసముద్రమునందుఁజేర్చి వేయుటే (దేహాత్మబుద్ధిని మఱపించుటే) అదియే మనుజుని చరమపరమ కృతార్థత.

తొలుదొల్త నీసమాధి మలినభావముతో నుండును, గాని, ఆత్మకృపచేఁ గ్రమముగా నామాలిన్యము తొలఁగి పోవును.

స్థూలదృష్టిచే మన కేమి తోఁచునో చూతము. యమ నియమాద్యంగముల వెనుక, పూర్వాపరావస్థలు క్రమముగాఁ బరిపాకము నొందును; యమము తర్వాత నియమము సిద్ధించు ననియు, నియమము తర్వాత ఆసనమునకు సమయమనియు, నిటులే క్రమముగా ధారణమును దానివెనుక ధ్యానమును సిద్ధింపఁగా గంభీరధ్యానముచే సమాధి సిద్ధించు ననియుఁదోఁచును గాని, వాస్తవముగా నటులు కాదు. సమాధిస్థితి రాఁగానే తక్కిన యోగాంగములు తమంతనే సిద్ధమగుట కనుఁగొందుము. సమాధి నిత్యసిద్ధవస్తువు. అదేదో క్రొత్తదికాదు. ధ్యానముచే సమాధి రాదు. సమాధిస్థితి వచ్చినపైనే ధ్యానము సిద్ధమగును. చీఁకటి పోయిన తర్వాత సూర్యుఁడుదయింపఁడు. సూర్యుఁడుదయించినంతనే చీఁకటి తొలఁగును.

ఇదిగో; ఏ యనులోమక్రమముచే సృష్టి యగునో, ఆయనులోమక్రమముతోనే ప్రలయమునగును. ప్రకృతివలన మహత్తు, మహత్తువలన నహంకారము, అహంకారమువలనఁ బంచతన్మాత్రలు, పంచతన్మాత్రలవలనఁబంచమహాభూతములును, నిటులనులోమక్రమముగానే సృష్టి యగుచున్నది. ప్రలయ సమయమందు సైతము, సూక్ష్మదృష్టితోఁజూచినఁబ్రకృతి యెపుడు "ఇఁక నేను పరిణామము నొందను" అని యను కొనునో, యాక్షణమునుండి తప్పక యీయనులోమక్రియయే సాగునని తోఁచును. అపుడు పైనుండి లాగుటయే యారంభ మగును. అనఁగాఁబ్రకృతి మహత్తును లీనము చేయుటకుఁబ్రయాస పడును; మహత్తు అహంకారమును లాగుకొనును; అహం కారము పంచతన్మాత్రలను, బంచతన్మాత్రలు పంచమహాభూత ములను నిటులాకర్షించుట యనులోమక్రియతోనే యగును, గాని పైకి వెలుపలనుండియే యని తోఁచును. క్రిందినుండియే ప్రలయారంభమగునని (అనఁగాఁబంచభూతములు పంచతన్మాత్ర లందును, పంచతన్మాత్రలు అహంకారమందును, అహంకారము మహత్తునందును, మహత్తు ప్రకృతియందును సమాప్తియగును. ఇటులే ప్రకృతి పురుషునందును విలీన యగును. అనఁగాఁబురు షునిలో నిల్చిపోవును. అని) యిపుడు మనకుఁదోఁచుచున్న యీ విలోమగతి యన్నది, లోపలనగు ననులోమగతియొక్క బహిర్వి కాసఫలమే. ఎటులనఁగా నదులు, శాఖానదులు, కాల్వలు మున్నగునవి పరుగెత్తి పోయి సముద్రజలరాశిని జేరి, వాని శరీరమును బోషించుచున్నటులు తోఁచును, గాని సముద్రిని యాకర్షణశక్తిచేతనే నదీనదాదులందలి నీరు సముద్రమువంకకుఁ బోవుచు నందుఁజేర్పఁబడుచున్నదని యెఱుంగుము. తో త్త

సముద్రము నడుమను బాగుట ప్రారంభమగును, గనుకనే నద్యాదుల జలము సముద్రమునం ప్రవేశించుచున్నవి. సరిగా, ఈవిధముగానే సమాధి యున్నచో యోగాంగములు నగును. జగమునందంతటను సమయోగముగలయోగి ప్రకాశించును. సమాధి వలన ధ్యానము, ధ్యానమువలన ధారణము, ధారణమువలనఁ ప్రత్యాహారము నిట్లే తక్కిన యోగాంగముల నెఱింగికొనునది. యోగశాస్త్రమందు సరిగా నీక్రమము చెప్పఁబడకున్నను, సాధకులు క్రిందినుండి మీఁదికిఁబోవుటకే ప్రయత్నించుచున్నను, చక్షుష్మంతులైనవారు, ఇంచుక స్థిరముగా నాలోచించినచో, సమాధి యొక నిత్యసిద్ధవస్తువనియు (అవస్థయనియు) అది యెల్లప్పుడును సమభావముతోనే యున్నదనియు, అది ధ్యాన ధారణములవలనఁ బుట్టదనియు, ఆధ్యానధారణాదులే సమాధి నన్నివిధముల ననుగమించుననియు, (అనఁగా సమాధితోడనే యవి రావలసినవనియు) సమాధిస్థితి కలుగఁగానే యమనియమాదులు ప్రకాశించుననియుఁ దెలియఁగలరు. సాధారణముగా జీవులీరహస్యము ననుభవమునకుఁ దెచ్చుకొన లేక, తమ సాధనగతిని క్రిందినుండి మీఁదికే ప్రారంభింతురు. మఱి యత్యంత శ్రమమునొందియు యథార్థాత్మస్వరూపము నెఱుంగ లేక హతాశులగుచున్నారు.

సాధకా! చూడుము, నీవు తొలుదొల్త యమమును సాధింపవలసి యుండును. బ్రహ్మచర్యము, అహింస, అస్తేయము, సత్యము, అపరిగ్రహము అనువానికి యమమని పేరు. వీనిలో నొక్కొక్కదానిని సాధించుటకు ఎన్నో యేండ్లు పట్టును. ఈవిధముగాఁ బ్రత్యేకయోగాంగము, దాని ప్రత్యంగములయు సిద్ధినొంది సమాధిని జేరి పరమాత్మసాక్షాత్కారమునొందుటకు, ఎన్ని

యేండ్లు! ఎంత యోర్పు! ఎంత ధైర్యము! కావలయునో? ఈయుగమున నది మిగుల దుర్లభము. పూర్వపూర్వయుగము లందలి మనుజుల చలశక్తి వేఱు. దారి చూపినంతనె ప్రగతి నొందు శక్తి యుండెడిది ఇపుడు మనకుఁబూర్తిగా గతిశక్తి నశించి పొట్టలమైపోయినాము. దారి చూపినంతనే పనులు సాగునా? ఔరా! దుష్కాలము! అమ్మ యొక్క అస్తిత్వము నందే నమ్మకము లేదే! చక్కగా నాధ్యాత్మికమార్గమునందు ముందంజవేయు బలమెట్లు గలుగును? ఆయోగాంగముల నను ష్ఠించుటకు సమయము సహిష్ణుతయు నేవీ? ఇపుడు, అమ్మ తనంతనే వచ్చి, తన సంతానమును జంకఁబెట్టుకొని పోవు కాల మెంతకఠోరముగా నున్నదో, చీకటి యెంత యొత్తుగా నల్లుకొను చున్నదో — పుత్రవత్సల — అమ్మ తన కరుణాసముద్రము నంతగాఁబొంగించుచున్నది. తన దయతో జగత్తును ముంచి వేయుచున్నది. అదె మన మాత మాతృత్వము. శ్రీమాత యస్తిత్వమందు గట్టి నమ్మకముతో, "అమ్మా! నీవే మా కన్న తల్లివి" అను మాట సరళాతిసరళమనస్సుతో ధరింపుము. అడుగడుగునందును, "అమ్మ, సత్యము. ఉన్నది. ఉండును" అని స్మరించుచుండుము. నీశుభసాధనమందు నీయుత్కంఠ లోటు పడ నీయకుము. ఈమాటలు నిబ్బరముగా నీగుండెపై వ్రాసికో. చూడు; నీసమాధి తనంతట దానే నీకడకు వచ్చును. మఱి చూడు; నీ యష్టాంగయోగము నీకుఁదెలియకయే సిద్ధమై పోవును. కేవలకాతరభావముతో, జాలితో, "అమ్మా! నీవు సర్వత్ర సర్వభావముతో విరాజిల్లుచున్నావు; నేనెందుకు నమ్మను? నా యీ యశక్తిమూలమందును నీవే యున్నావు. మమ్ముల నెందుకీ యంధకారమున ముంచి యుంతువు? అమ్మా! ఒక్క

సారి శైలికన్ను విడఁజేయకుము. ముల్లోకముల వ్యాపించిన నీస్నేహారసము నాస్వాదించుభాగ్యము కేవల ముముక్షుసాధకుఁడే యొసంగును. అమ్మా! యని పిల్చి తలంచుకొనుచు దాని తోనే ధన్యుఁడనౌదును. ముక్తాఫలములచే శోభిల్లిన యీ ప్రాణము సరసమగును." అని చెప్పుచుందును. పశ్చాత్తాప పడుము. తల్లియే నీవిశ్వాసమున స్థిరపఱచును. అపుడు సమాధి సంధానమునకు నీవు ప్రయత్నింపకున్నను, అది బుద్ధియోగఫల ముగాఁదనంతనే సిద్ధించును.

కాని, ధనలోలుఁడవు గాకుమా. ఈశోపనిషత్తునందు "మా గృధః కస్యచిద్ధనమ్" అనినట్లు విషయగతధనగ్రహణము చేయకుము. అనఁగా, నేవిషయములకును ముగ్ధుఁడవుగాకుమా. ధ్యానధారణాదియోగాంగము లెపుడును విషయముల వంకనే పోవుచుండును. సమాధియో — యెపుడును (ప్రజ్ఞ) అఖండ జ్ఞానమందుఁబ్రతిష్ఠితమగుటకే చూచుచుండును. గాని ధారణ ధ్యానాదికము విషయాభిముఖ్యమనెడి ధనలోభమును విడువ లేదు. మన ప్రత్యేకకార్యమందును సమాధి (అష్టాంగయోగము) సిద్ధమగుచుండునని మున్నే చెప్పియుంటిని.

మనుజుఁడు రేవగిల్లు విషయధ్యానమునే చేయుచున్నాఁడు. విషయముల ధారణకే యలవాటు పడినాఁడు. విషయభోగమునకే యింద్రియనిరోధము చేయుచున్నాఁడు. అతఁడు చేయు సాధనమెంతయైన, నది రూపరసాదిప్రాప్తి యనెడి ధనలోభముతోనే సాగించుచున్నాఁడు. కావున నవి యన్నియు నసాధువులు. సమాధి యన్ననో, స్వభావముచేతనే నిర్మలము. సర్వదా ప్రజ్ఞతోఁజేరుటకే చూచును. ఈ యున్నతసమాధి భావము గలుగనంతసేపు, మనుజుఁడాలుబిడ్డలు మున్నగువారిని

దనుపుటకే లాలసుఁడగుచుండును. యోగాంగములు, పరూప రసాదులను దెచ్చి పెట్టుచుండునో కానినే సమాధి బయల్పెట్టుచుండును. సమాధియే లేకున్నచో విషయములు ప్రకాశించుటయే యుండదు. ఈవిధముగా నొంతకాలము తన పరిహారమును బోషించుచున్నను, తన యున్కి నెఱవేఱినపుడు, ఆసమాధి విషయములనుండి తానే విముక్తమునొంది, యొక్కటిగాఁ బ్రజ్ఞతోఁ జేరఁజూచును గాని, ధ్యానధారణాదులు మున్నిటివలెనే ధనలోలుపతకు దూరము కాకుండెనేని సమాధి నోడించుచునే యుండును. "మన ప్రభువు సమాధి, మన వెంటనంటి విడకున్నాఁడు" అని ధ్యానధారణాదులనుకొనుచుండును. ఇఁక సమాధి యున్ననో, ధ్యానధారణాదులు నాకనుకూలములై భూమానందము ననుగమింపవలయునని కోరుచుండును. ఇట్టి పరస్పరవిరుద్ధభావమే కారణముగా, ధ్యానధారణాదులవలన నపుడపుడు సమాధి పరాజయమునొందుచుండుట యగును. అవి యన్నియు సమాధికంగములైనను, నిపుడవి బలవంతములును స్వతంత్రములునై రేకెత్తుచుండును. చిరమునుండి యహంబుద్ధి గల జీవభావముతోనుండుటచేతనే, అన్నిటికిఁ బ్రత్యేకముగా నొక్కొక్క "అహమ్" యేర్పడి, నాతో నెవఁడు సమానుఁడని యొక్కొక్కటియు స్వతంత్రముగాఁ గోరుటచే సమాధి మోసపడుచుండును. అసలుమాట యేమనఁగా — బుద్ధిమయక్షేత్రమందు నిల్చి కొంచెము కొంచెముగాఁదన్మయత్వము లభించు నంతవఱకు విషయ సంస్కారములు దూరముకావు. అందుచే సమాధి దీర్ఘకాలము నిలువదు. నిర్మలమును గాదు.

ప్రత్యేకజీవుని హృదయమందును నిట్టి సంఘటనమే యగుచుండును. మన తల్లి ప్రత్యేకజీవుని హృదయమందును

నెట్టి భావముతో నావిర్భవించి జీవుని ముక్తిమందిరమునకు లాగునో, యేసాధకుని హృదయమందు గుప్తరూపమున సంఘటితయగునో, అవశ్యము బయల్పడునాభావముతోనే ప్రకటమై వానిని ముక్తిమందిరమున కాకర్షించును. అట్టి ప్రకాశ్యభావముతోనే సిద్ధముగాఁగానఁబడుటకై విశిష్టరూపముతో నవతరించును.

సమాధిధనము ఆనందమే. దానిని ధ్యానధారణాదులు తీసికొనును. ప్రత్యేకకర్మమందును జీవులు ఈయష్టాంగయోగము ననుష్ఠించుచునేయున్నారు గాని, యది విషయేంద్రియ సంయోగమునకై నది గాన సమాధి మూలముగాఁగల్గు నానంద సింధువునందొక బిందుమాత్రమే. బ్రహ్మ మొదలు చీమవఱకుఁ బ్రత్యేకానందమునకై చూచుచుండును. సంసారమునందు ఎండమావులవంటి కామకాంచనాద్యాశలతో జీవకోటి పిచ్చిదై, గ్రుడ్డిదై, దిగ్భ్రమముతోఁబరుగులెత్తుచుండును. ఉద్దేశ్యము క్షుద్రానందమే. ధార్మికులు ధర్మము ననుష్ఠించి యానందము నొందుదురు. ధర్మదూరులు, పాపులు నిందితకర్మములు చేసి యానందింతురు. ఆనందాంశమందు రెండును సమములే. "గంజి త్రాగువాఁడు కాంచెడి తృప్తినే పడయుఁబాయసాన్నభక్షకుండు" అటులే ఆనందాంశమందు రెండును సమానమే. కారణమేమి? "ఆనందమే బ్రహ్మము — ఆనందమే అమ్మ" సచ్చిదానందమయి తల్లి యొక్క సత్స్వరూపము, విశిష్టభావముతో జడపదార్థములందు ఉదితమగుచున్నది. అమ్మ యెట్టి సత్స్వరూపయో, అనఁగా అమ్మ యెవ్వరో, మనకుఁజక్కఁగాఁదెలియఁజేయుటకే, యీకానవచ్చు జడపదార్థములందే సదా ప్రకటిత యగుచుండును. మన తల్లి చిన్మయి. ఆమాట లెస్సగాఁదెలుపుటకే, ఆమె ప్రాణిరూపమున నంతటను దోఁచుచున్నది. ప్రాణు

లందు మనము చైతన్యసత్తయొక్క విశేషవికాసము కనుచున్నాము కాదా! మఱి యానందధర్మము విశేషరూపముతో దానియందే యున్నది. మఱియొక యానందమొక్కడనో లేదు. ఆత్మయొక్కటే యానందఘనమూర్తియై సదా సర్వత్ర ప్రకాశించుచున్నది. ప్రతిజీవుని యందు విషయభోగమునకైన యానందమేది కనుచున్నామో, యదే, ఆ యానందసముద్రమందలి యొక బుడగ మాత్రమే. ఈ యానందమును జీవుం డేవిధముగా ననుభవించుచున్నాఁడు?

మనము, ఏదేనొక యభీష్టవస్తువును సంగ్రహించుటకుఁ బ్రయత్నించునపుడు, మనమనస్సును నింద్రియములు నాయుద్దేశ్యముచేఁ బ్రేరితములగును. అపుడు బుద్ధియును ఆనందసముద్రమందు జాఱి పోయి విషయాభిముఖి యగును. ప్రయత్నము సఫలమైనంతనే, అనఁగా అభీష్టవస్తువు ప్రాపించినంతనే, యింద్రియ మనోబుద్ధులు క్షణకాలము స్థిరపడును. అపుడు బుద్ధియం దానందప్రతిబింబము ప్రకాశించును. ఇందుచే నానందము గల్గును. అప్పుడు మనము, అభీష్టవస్తువే యానందదాయక మనుకొందుము. ఇదే యజ్ఞానము. విషయమందానందము లేదు. ఆనందచ్ఛాయ యెల్లపుడును బుద్ధిపైనే పడును. బుద్ధి యాప్రతిబింబముపై పులక్ష్యముంచక విషయమువంక కెపుడు పరుగెత్తునో, యపుడె మనమానందమునుండి చ్యుతులమై పోదుము. మఱల బుద్ధి స్థిర పడునపుడే యానందానుభవమగుఁగాని, యిచ్చట నొక యాశంక కలుగ వచ్చును. "ఆనందమొక యఖండస్వరూపము గదా. మనము భిన్న భిన్న విషయప్రాప్తిచే, భిన్న భిన్న ప్రకారముల యానందమెటులొందుదుము" అని. ధనము లభించుటచేత నెట్టి యానందము లభించుచున్నదో, యట్టిది గాక, యింద్రియ

పరిత్యక్తసాధనమందు వేఱొక విధమైన యానందమెట్లనుభవింపఁ బడుచున్నదో? ఒక చక్కని పూవును జూచునపుడగు నానందమే, మధురగానము వినునపుడు కాదేమి? యను నీయాశంకలకు బదులుమాట యేమనఁగా — ఆనందవస్తువు నిజముగా నఖండ మయ్యును, అది విషయేంద్రియసంయోగనై చిత్త్యవస్థమున, మన యెడ భిన్నభిన్నరూపములతో ననుభూతమగుచున్నది. మన యింద్రియములు విశేషరూపముతో సంతుష్టములగునపుడు, ఆయింద్రియముల తనివి యందైన విభిన్నతయే యానంద మందలి విభిన్నతగాఁబ్రతీతమగును గాని, యానందముమాత్ర మఖండమే.

ఆనందమున కభావ మెన్నఁడును, నెచ్చటను లేదు. జగ మంతయు నానందముతో నిండియున్నది. ఆనందము నుండియే జీవుఁడు పొడమినాఁడు. ఆనందముతోనే జీవితుఁడగుచున్నాఁడు. ఆనందమునందే జీవుని యవసానమగుచున్నది. ఈ మోహాన వాణినే ఋషులు పలుతావులఁ బలుసారులు వెల్లడించిరి. ఈ యుగమందు సైతము దీని లోఁతునెఱిఁగినవారును ఈయొక్క మాటనే యుద్ఘోషించుచున్నారు. శోకార్తుని కరుణపూర్ణ రోదనము, రోగార్తుని హాతాశనుదెల్పు నిట్టూర్పు, క్షుధార్తుని యాఁకటి మొఱ్ఱ మున్నగునదంతయు నానందమును బ్రకటించునదే. మనుజుఁడీవిధముగా నేడ్చి, హాహాకారములు చేసి యానందము జాడ గాంచుచున్నాఁడు. అందులకే యటులు చేయుచున్నాఁడు. చేదుమందు, అనఁగానే రోగి చీదరించుకొనును; ఊరకే డోకును; అయినను వానికామందునందలి రోగనిర్వారణశక్తిరూపమయిన యానందలక్షణము నచ్చెనేని, యామందు నానందముతో సేవిం

చును. వ్రణము పుట్టిన యంగమును గిత్తిపోఁజేల్చి కట్టుకట్టుట వల్లనగు పీడయందును నొక సాటిలేని యానందము సంధానిత మగును. రాముని వనవాసము, సీతాపహరణము, హరిశ్చంద్రుని రాజ్యచ్యుతి, అభిమన్యువధము మున్నగు కథలందుఁగరుణారసము నుద్దీపింపఁగల నటకుల యభినయమును జూచునపుడు సహృదయులు కన్నీరు కార్తురు. అప్పుడప్పనందును నానందాస్వాదమున్నది. కరుణయు నొక రసమే. "రసో వై సః" రసస్వరూపిణి యమ్మయే. ఆరసము (ఆనందప్రవాహము) కరుణాకారముతో వెలికి వచ్చునపుడు దానినే మనము దుఃఖమనుచున్నాము. ఈవిధముగా శృంగారవీరహాస్యాదికానేక భావములతో రసస్వరూప అమ్మయే ప్రకట యగుచు, అత్యంతప్రియజీవరూపిసంతానముచే మాటిమాటికి నానందరసపానము చేయించును; గావుననే సౌభాగ్యలక్ష్మి పేరి బ్రహ్మశక్తిని స్తుతించిన ఋషి, సౌభాగ్యహృదయమందు "నానావిధమహాకారరసానుభవకారణామ్" అన్నాఁడు. పతివ్రతయైన సతి, మరణించిన తన మగనితో, మండుచున్న చితిలోఁబడఁబోవును. అపుడా ప్రాణాంతకరమైన దుర్భరమైన యగ్నిదాహమునందు సైతము నొక యవ్యక్తానందము ననుభవించును. ఇటులే జగమునందంతటనని తెలియునది. అంతఃసలిలప్రవాహము గల ఫల్గునదివలె, అంతర్నిహితానందరససంధానము చేయువాఁడు, జాగతికమైన దుఃఖశోకసంతాపముల నడుమనున్నను, నిత్యనిత్యానందమునే భోగించుచుఁగృతార్థుఁడగుచున్నాఁడు. ఔరా! జీవుఁడా! నీవెపు డాయానందరసపానము చేసి యనంతశాంతి నొందుదువో కదా! ఇదిగో, సమాధి, యీ యఖండానందసముద్రము లోఁతు చూచునది; గాని ధ్యానధారణాదులు విషయానందమగ్నములు ఆనందమయి, అమ్మ తన

స్వరూపమును గుప్తముగానుంచి లీలలు నెఱపుచే ప్రపంచము యొక్క కపటవేషమును బాల్చి యానందబిందుపానము చేయునో, యాయుద్యోగమునే యోగాంగములన్నియుఁ జేయును; కనుకనే సమాధితో పీనికిఁ బరస్పరవిరోధము. అవిషయసంస్కారముల నైన యానందకణములు స్ఫురితము సమాధివల్లనే పొందఁబడును. ఇతరయోగాంగములు ఆనందము చేరువకైనను బోలేవు. కావున మనస్సు ఆజ్ఞాచక్రమందు నిలిచి మాయానందము నాస్వాదించు నంతనే ఖండఖండానందగ్రహణమగుచుండును. ధ్యానము, ఏదే నొక విశిష్టపదార్థమందే సమాప్తమగుచుండును. కేవలవిషయ ములను ధ్యానించువాఁడు అఖండానందమును ఖండములుగాఁ జేయుచున్నాఁడు. మఱియు నేవిశిష్టమూర్తినో జ్యోతినో విశిష్ట భావముతో ధ్యానించువాఁడును, సమాధిచేఁబొందఁబడు నఖండా నందమును ఖండఖండములు గానే చేసి వేయుచున్నాఁడు. ఈవిధ ముగా ధారణధ్యానప్రత్యాహారప్రాణాయామాదులు, పరిమితా నందమునెడనే ముగ్ధములు. యోగాంగసమూహముయొక్క యీసీమాబద్ధముగ్ధత, సదా చేయఁబడు ప్రత్యేకకర్మమందును, యోగశాస్త్రోక్తభగవత్సాధనమునెడను రెంటను ప్రాయశః సమానమే. అయినను ఆత్మజ్ఞానప్రాప్తి యనెడి యుద్దేశ్యముతోఁ జేయఁబడు యోగాంగములు జీవుని యాత్మజ్ఞానప్రాప్తికే యుప యోగించును. ఎంతదాఁక యమనియమాదిసాధనసహాయము చేనే యాత్మనెఱుంగఁగడంగునో, కేవలయోగాంగసహాయము తోనే యఖండానందస్వరూపానుభవము చేయఁగడంగునో, యంతదాఁక యథార్థానందసంధానము కాలేదని యెఱుంగఁ గలఁడు. సర్వత్ర సుప్రకటమై యున్న దానిని నిరిచ్ఛామాత్రము చేతనే పొందఁగలవు. అనఁగా నాయానందానుభవము చేయఁ

గలవు. దాని దర్శనమగు ముహూర్తమందే సమాధి సిద్ధమగును. సమాధి సిద్ధింపఁగానే యోగాంగములు తమంతనే సిద్ధమగును. అమ్మను జూతునని నీవు యమనియమాదులను జరుపుచున్నంత సేపు, అమ్మను జూతునని పద్మాసనమందు విశిష్టాకారముతోఁ గూర్చున్నంతసేఁపు,ఇంద్రియముల నడ్డగించి యమ్మను దర్శింతునని నడుము గట్టుకొని ధ్యానించునంతసేఁపు, నీవు మాతృలాభము నొంద లేవు. మాత వచ్చినంతనే ధ్యానము తనంతనే కుదురును.

నేనిచ్చిన భోజనదృష్టాంతము స్మరించుకో. మాతృలాభ సమయమునఁగేవలము 'నేను తల్లిని జూచుచున్నాను' అనుచు నీచూపు తల్లివైపే మఱల్పుము. నీయోగాంగములన్నియుఁ దమంతనే సిద్ధమయ్యెననుట తర్వాత నీవే కనుఁగొనఁగలవు.

ఆహారవిహారాది దైనికకర్మములన్నియు స్వాభావిక ములై పోయినటులే,యప్రయత్నముగానే యవన్నియుఁదమంతనే సిద్ధమగునని తెలిసికొన్నావా ? శ్రీ మాతృప్రాప్తియు నటులే స్వాభావికమమ్మా ! మన యమ్మ సహజవస్తువు. అది తెలియ లేక, అమ్మ యెక్కడనో మనకందని దూరదేశమున నున్నదను కొందురు. కష్టపడి మాతృస్నేహాకర్షణము చేయుమమ్మా ! ఆమెయో – తన బిడ్డనెయ్యము లాగుచుండుటచేఁబానే మన వెంటఁబరుగులెత్తుచున్నది. అమ్మా ! యని మొఱపెట్టుము. అమ్మ యెక్కడనో లేదు. ఇక్కడనే యున్నదని నమ్ముము. అమ్మ గుండెపైనే కూరుచున్నాము. మాయమ్మ యేదీ ? యనుచున్నాము. అందుకే యమ్మ యెప్పుడును దుఃఖపడు చున్నది. ఈవిధముగా అమ్మ నవజ్ఞ చేసినచో నామె యెంత కంగారుపడునో! ఇట్టి యవజ్ఞ మాని 'అమ్మా!'యని పిల్చితిమా– యారాజరాజేశ్వరి, బ్రహ్మాదిజనని "వచ్చితి, వచ్చితి"నని మన

లను దన యొడిలోఁజేర్చుకొనును. ఆమెను నీవు చెదరని జాలి చూపుతోఁజూచి "మా యమ్మవు నీవా" యనుచు, ఆమూపు మఱలింపక చూడ నలవాటుపడుము. సమాధికై విచారింపకు. అది తనంతనే వచ్చును. నీవు సదానందమందు నిల్తువు. ఆమెయు నట్టి స్వాభావికానందమును స్వాభావికమాతృమేలనమునే కోరుచుండును. సర్వదా సర్వభావములతో అమ్మను జేరి యుండఁగల్గితే, సర్వదా అఖండానందాస్వాదముతో నుండఁగల్గితే, సమాధివిషయమైన యాకాంక్ష. ఇఁక విను.

"ఆపరమాత్మయే నేను" అనునిట్టి యవస్థ సాధకులకుఁ గల్గును. జీవునకెపుడు సమాధి సాక్షాత్కరించునో (సమాధితోఁ దనకెపుడు పరిచయము గల్గునో) అపుడె వానికి 'సోఽహమ్' అనెడి మాట లోలోనఁబ్రతిధ్వనించును. అదిగో — ఆ "సోఽహం జ్ఞానము" పేరే సమాధి. "ఆపరమాత్మయే నేను" అను నీప్రజ్ఞ పేరే సమాధి.

పుస్తకములు సదివినంతనే, ఉపదేశములు విన్నంతనే, సోఽహాంబోధ వికసింపదు. "ఈతల్లియే మనయందయిన స్నేహముచేఁదన్నుఁదాను మఱచి 'నేను' అయిపోయినది. అనంత మహిమమయి, అనంతకోటిబ్రహ్మాండాధీశ్వరి అమ్మయే, యీ మన 'నేను'రూపుతో వెలయుచున్నది" అను నీయనుభవ మేమూరుతమందగునో,యామంచి మూరుతమందే సమాధి.అపు డెట్టి యవస్థ యగునో యది మాటలతో వెల్లడించు టెటులు ? అది మూఁగవాని బెల్లము. అది స్వసంవేద్యమాత్రమే (ఎవని కట్టివానికిఁదెలియవలసినదే). మూఁగవాఁడు బెల్లమును దిని, దాని రుచి నెఱుఁగఁగలఁడే కాని, దానివర్ణనము చేయ లేఁడు. అటులే, చెప్పవలయుననెడి యభిలాషముతోఁదనకు వీలయినంత

చెప్పఁజూచును గాని, యనుభవించినంత చెప్పఁజాలఁడు. అపుడెట్టి యవస్థలోఁబడునో తెలియునా ? — కన్ను జాగతికరూపములను జూడదు. అమ్మయొక్క రూపహీనరూపసాగరమున మునిఁగి పోవును. చెవి జాగతికశబ్దములను వినదు. చప్పుడు లేని యమ్మ పిలుపును విని మతిపోయి యుండును. నాలుక, ఆయఖండరసమునే గ్రోలుచు మొద్దువాఱి పోవును. ముక్కునకు శ్వాసప్రశ్వాసముల పనియే యాఁగిపోయి, సకలమాతృస్వర్గీయసౌరభముతో స్తబ్ధమై పోవును. (ప్రాణాయామకుంభకావస్థ తనంతటనే సిద్ధమగునని యర్థము.) త్వక్కు మాతాలింగనమధురస్నేహమయస్పర్శముచే నేమగుచున్నదో తెలిసికొన లేదు. శరీరప్రత్యేకపరమాణువు నెట్టి యానందరసముతోఁదడిసి పోవునో దానిని వర్ణింప లేము. "నిష్పీడితేందుకరకందళితోఽనుసేకః" అని భవభూతి మహాకవి చెప్పినటులు, చంద్రకిరణములను బిడిచి, యా యమృతసారముతో లోను వెలిని దడిపినను ఆ సుఖమయస్పర్శముతో సాటి కాదు. సరోజమ్మా! మఱియు వింత; — హృదయపిండము పనియు నొక్కప్పుడాగి పోవును. రెండు కన్నులును శవనేత్రములవలె జ్యోతిర్హీనములయి పోవును. అంగప్రత్యంగములు. పట్టు సడలి పోవుటో, కొయ్యవాఱి పోవుటో యగును. జాగతికములైన భిన్నభిన్ననామరూపములు మతే వియుఁదోఁపవు. పెక్కేల ? శరీరమున్నదన్న తెల్వియే యొక్కసారి లోపించి పోవును. కేవలానందమయచిత్సముద్రమే మిగిలి పోవును.

ఇంకను వినుము. సరోజా! బిడ్డా! మొట్టమొదట "ఆ పరమాత్మయే నేను" (ఆభవానినే నేను) అను బోధప్రవాహమే నీలో సాగినది కదా. అదే సోఽహంభావ (సాహంభావ) సమాధి.

దానినుండి జారి పోకుండ, అప్రవాహ మాగిపోకుండఁజూచుకొనుము. ఈవిధమైన సమాధి మఱికొంచెము దినములు అలవాటు పడెనేని, యప్పుడు మఱి "ఇంద్రియ, కర్మ, నీవు, నేను" అను మాటయే లేని నిస్త్రైస్థితికి వత్తువు. అప్పుడేముండునో, ఏమియుండునో చెప్ప లేవు. ఊహింప లేవు. సరోజా! నేను కొంచెము చెప్పనా? అప్పుడుండునదియే మహాసత్తే. మహాచైతన్యము. నిస్సీమానందము. సందేహము లేదు. అమ్మాయీ! కాదు, కాదు. అది మహాత్ అన లేము; అణువు అన లేము. ఏమంటేనప్పుడు పరిమాణజ్ఞానముండదు. మఱి దాని నేమనుటంటేని, ఒక్క విశేషము. నీవు దానిని అణువనుకొంటే నట్లే చూతువు. నీవు మహాత్ అనుకొంటే మహానే. నీవు తలంచు స్వరూపముగానే ప్రతీతమగుచుండును. మఱొక్క మంచిమాట. యథార్థమేమంటేని- ఆస్థితికి వచ్చినప్పుడు సంకల్పములే తల యెత్తవు. కారణమేమో యెఱుఁగుదువా? సంకల్పములు చేయునదియు సంకల్పరూపమైనదియు మనసు. మఱి దాని జాడయైన నుండదు. (ఇదే మనోవిలయము.) అమ్మ దయచేసి, యట్టి దివ్యక్షేత్రమునందు మఱి కొంత యెక్కువసేపు నిల్వనిచ్చినా — చెప్పెడిదేమి, బిడ్డా! మఱి సంకల్పము తలయెత్తుట సున్న. ఏమన, సంకల్పములుదయించు తావది కాదు. ఆచోటు దానికంటె మిగులఁగ్రిందిది. ఔరా అమ్మ యొడి! ఎంత సుఖమయము! ఎంత యానందమయధామము! మన తల్లియొడి! అదె మన యున్నరూపు.

అమ్మ యెప్పుడు జీవుని సోఽహంజ్ఞానమునకుఁజేర్చునో, యెప్పుడు జీవుఁడు జీవబ్రహ్మైకత్వము నిది యని తెలియఁగల్గునో, యప్పుడే మెల్లమెల్లగా వాని జీవత్వబంధనము, కర్మవాసనలు, దేహాత్మబోధ మున్నగునవి విడిపోవ నారంభించును. ఎంతదాఁక

బరిపక్వావస్థ రాదో — అనఁగా నెంతదాఁక జ్ఞానము సంశయ రహితము కాదో, ఎంతదాఁక చిత్తము తార్మాణు పొరపాటుల కును గలతకును దూరము కాదో, యెంతదాఁక సాంసారిక సంస్కారములు తలయెత్తుట తప్పదు. ఎపుడు జీవుఁడు సోఽహం భావమందవస్థితుఁడుగా (నిల్కడగని) నుండునో యపుడిట్టిని మఱచి యుండఁగలఁడు.

సరోజా! అదియు నెంతసేపు? కొంచెము సేపే. మఱల సంస్కారములు తలసూపును. మఱల, "నావి నావి" యనుకొను చుండిన వాని వార్తలు విన వ్యాకులపడుచుండును. అది యొక యవస్థ. అది కేవల సాధకునకే యనుభూతమగును. సాధకుఁ డెపుడు సోఽహంభావముతో జాగృతుఁడై తన్మయుఁడగుటకు మొదలగునో, యపుడతఁడు నిరాలంబమహాచిత్సముద్రమందు, ఒక క్షుద్రజీవభావముతో మునుఁగవలసి వచ్చునపుడు, ఎట్టి భీతినొందునో యూహింపుమా — ఒకవంక నానందావేశము, ఒకవంక భయముతోఁగూడిన చింత _ కాదా? ఎందుచేత? జీవుఁడు బహుకాలమునుండి క్షుద్రక్షుద్రవస్తువులయు, క్షుద్రక్షుద్రభావ ములయుఁదోడ్పాటుతోనే, అహంతాజ్ఞానమును రేపుటకే యల వాటు పడినాఁడు. కనుకనిపుడు, మేర లేని, యలలు లేని చిత్స ముద్రమునఁజొచ్చునపుడు తొలుదొల్త నిట్టి చీకాకునఁబడుట యెంతయుఁదప్పదు గదా. అన్నా! యేమిది? ఈచిక్కులోఁబడి తినే; యనుకొనును. ఇంద్రియరాజ్యమందు మనఃక్షేత్రమునఁ బరిచ్ఛిన్నభావములతోనే చరించి చరించి, యొక్కసారిగా నాకస్మికముగా భావాతీతస్వరూపము సమీపింపఁగానే, మొట్ట మొదట నిట్టి యవస్థ కలుగునా? కలుగదా? అమ్మా! సరోజా! నీకుఁగలిగినదా — లేదా? మఱలఁగ్రమముగా జగదంబ కృపచే

నలవాటు పడుచున్న కొలఁది, భీభయమంతరించును. సరిగదా, అప్పుడదే తన యిల్లనుకొనసాగును. మఱి, యాహారసంచారము, దేహము, మనసు, బుద్ధి, యింద్రియములు మున్నగు వానిని విదేశముగాఁదలంప మొదలిడును.

అటుఁగాక, ఆవిస్మయవిహ్వలావస్థయందు జీవుఁడు మఱల నొకచిన్న భావసంధానము చేయుచుండును. ఏమన - దాని కభ్యాసపడి యున్నవాఁడు గాన, ఆలుబిడ్డలు దేహము మున్నగు వానియందు లోతుగా నాటుకొన్న సంస్కారవశముల ప్రాపున మఱల నించుక తనివి నొందుచుండును.

బిడ్డా! సరోజా! నీవు చిన్న చంటిపాపను వీవనతో నెప్పుడేని గట్టిగా విసరి చూచినావా? విసరి చూడు. ఆపాప యెటు లుక్కిరిబిక్కిరియగునో. ప్రబలవేగముతోఁ బ్రవహించు గాలిదెబ్బకా బిడ్డ యూపిరి యాడక శ్రమమొందును. కాదా? అటులే, యీ స్థితిలోనున్న జీవునకు సైతము, ఆయానందభయవిస్మయావస్థలు ఒక్కసారి కూడుకొనుటచే ఉక్కిరిబిక్కిరియై చీకాకు నొందునైనను, ఆనందానుభవము నించుక రుచి గొన్నవాఁడు గాన, జాగతికవాసనలు క్రమ్ముకొన్న వేళఁదొలఁగఁద్రోసికొంచు, ఆత్మబోధయే యూఁతగా, నిరాలంబసత్త్వంక ముందంజ వేయుచు, చిరపరిచితములైన యాక్షుద్రములను మఱలఁజేకొన నొల్లక ప్రయాసంపడుచుండును. ఇదె, యమ్మ కరుణచే నగు సమాధి యెడ జీవునకుఁగలుగు నుత్కంఠ.

నీ జాబులందెన్నిటనో నీ యీ యుత్కంఠను నేఁగని పెట్టితినమ్మా!

సరోజా! ఏదీ, యిటురా; నీసాధకసోదరులతో సావధానవై కూర్చుండుము. ఇపుడు మనము సోహంతత్త్వమును

దెలియ నించుక ప్రయత్నింతము. మనమెంతమాత్రము తెలియఁ గల్గుదుమో, యది మన బుద్ధిపాటవమునందే యుండుననుట మఱువకు. భగవత్తత్త్వము మానవబుద్ధ్యతీతమై యున్నది. గాన నింతదాఁక నెవ్వఁడును దానిఁబూర్తిగా నెఱుంగ లేఁడయ్యె. తెలిసికొంటి నన్నాఁడా? సందేహమే యది. హరిహరవిరించ్యాదుల ధ్యాన మునకును నగమ్యమైన అమ్మ, మానవబుద్ధిగమ్య యెటులగును. సరే, మనకీ — జగన్మాతనుగూర్చిన బిందుమాత్రజ్ఞానముండినం జాలును. చీమకుఁబంచదారకొండ పరిమాణము నెఱుంగు నక్కఱ యేమున్నది.

'సోఽహమ్' శబ్దార్థమేమి? వాఁడు నేను. వీఁడునేనుకాడు. "వాఁడు నేను" ఈ 'నేను'నకు మూఁడు రూపములు. అనఁగా 'నేను' మూఁడు రూపములుగా నున్నది. మొదటి నేను జీవుఁడు. రెండవ నేను ఈశ్వరుఁడు. ఇఁక మూఁడవ నేను పరముఁడు. ఆ మూఁడవవాఁడగుటే ఈ నేనుయొక్క పరమభావము. అదె శ్రేష్ఠతమావస్థ (రూపము). అది మనోబుద్ధుల కతీతస్వరూప మగుటచే జీవభావమునకుఁగేవలమప్రత్యక్షము. కావుననే సర్వ నామమైన "సః" శబ్దము ప్రయోగింపఁబడినది. వ్యాకరణాను శాసనానుసారముగా సైతము, అప్రత్యక్ష విషయమందే తచ్ఛబ్ద ప్రయోగము చేయఁబడును. ఇందువలన నిట "సః" శబ్దముచేఁ బరమాత్మయే కైకొనఁబడును. 'నేను' అన్నను, ఆత్మయన్నను నొక్కటే. వాస్తవముచే జీవాత్మపరమాత్మలు వేఱుకావు. ఆత్మకు, ఏకల్పితాంశముచే జీవభావము వికసించునో దానిపేరే జీవాత్మ. ఏయంశమం దెట్టి భావవికాసమును లేదో, యదె పరమాత్మ.

ఆత్మయొక్క యీపరమభావమెట్టిది? (పరమభావ మనఁగానేమి?) అది కొంచెము తెలిసి కొందము. ఏభావముతో (ఏయవస్థయందు) ఆత్మ సచ్చిదాత్మయై యానందరూపముతోఁబ్రకాశించుచుండునో — అనఁగా దేనియందు అచిత్, అసత్, నిరానందములనునవి యెన్నఁడు నెంతయులేవో యదియే పరమభావము. దానిని భాషలోనికిఁ దెచ్చి, భావము — అవస్థ — స్వరూపము మున్నగు పదములు ప్రయోగించుచున్నారు. విచారించినచో, ఆపరమున కీపదములు ప్రయోగింపఁదగినవి కావు. ఏమన — భావము, అవస్థ, స్వరూపము మున్నగునవి పరిచ్ఛిన్నపదార్థములం దే యుండును. స్థూలముగా యోజింపుఁడు. అసత్తుయొక్క జాడ వెదకినను లేనిదియు, అచిత్ అనుమాట యనుటకును వీలు లేనిదియు, నిరానందము లేశమాత్రమును బొందనిదియు, నెట్టి పరిచ్ఛిన్నతయు లేనిదియు, రూపరసాదివిషయసంపర్కము లేనిదియు నైన నేనుయొక్క యొక యవస్థ యున్నది. ఈకారణముచే భావాభావములు రెండును నటఁబ్రతీతములు కావు. ఆయవస్థయే 'నేను' అను దాని పరమభావము. నీవు సదా యేచైతన్యసత్త మూలముగా సాగుచున్నావో, దాని నొక్కసారి దేహము, మనస్సు, ఇంద్రియములు, అను వానిని మఱచి నీతెలివికిఁజేరువగాఁదెచ్చికొని స్థిరముగా నుంచుకొనఁగల్గుదువేని, ఈపరమాత్మభావాభావమును బొందుదువు. అయిన నచట (అట్టి స్థితియందు) నేను, నీవు, వాఁడు — మున్నగువాని జ్ఞానముండదు సుమా. దానిఁదెలియు వాఁడు (జ్ఞాత), చూచువాఁడు (ద్రష్ట) అనుటయుండగదు సుమ్మా. ఏమందువా — ఆయవస్థయందుఁబూర్తిగా జ్ఞేయము లేదు; దృశ్యము లేదు. ఇదిగో, ఈయవస్థ పేరే పరమాత్మ.

అదే 'నేను' యొక్క పరమభావము. సౌందర్యలహరిలో నా తత్త్వవివరణమందుఁబరమశివుఁడిదే.

అమ్మా! సరోజా! మనమిఁపుడు 'అహం' వస్తువగునేమో తెలియఁబ్రయత్నింతము. చండీసప్తశతికి అంగములుగానున్న గ్రంథములలో (శ్రీ)దేవీసూక్తము ప్రాణభూతము. అది మీకుఁ జక్కఁగాఁదెలియుటకే దాని పరమార్థము యథాశక్తిగా వ్రాసితిని. చూచితివి గదా. అందులో నీ'అహం'స్వరూపప్రశ్నమే కదా కలదు. ఇచట దాని సంగతియే మఱియొక విధముగాఁ దెలియఁబ్రయత్నింతము.

సరోజమ్మా! చూడు — మనము కడుపునిండ నొక్కసారి తిన్నంతనే మఱి బ్రతికి యున్నంతకాలము ఆఁకలి వేయకుండునా? ఉండదు; ఆలాగుననే, యతిగహనమైన యాత్మతత్త్వమును గేవలమొకసారియే యాలోచనముఁ బెట్టినంత మాత్రానఁబట్టువడునా? మాటిమాటికి దీనిఁగూర్చిన యాలోచనానుశీలనములు చేయుచునే యుండవలయును. (అనుశీలన మనఁగా — తలుచు అభ్యాసము). కనుక నిట్టి విషయమును బలుసారులాలోచించుటకు మనము బాధ్యులము గదా.

సరే; ఇది విను; పరభావమును గూర్చి కొంత విన్నావు. అదిగో, దాని యద్వితీయమైన యంశమందు స్వభావముగా లీలాకైవల్యవశమున (కేవలవిలాసముచే) ఒక యహంబోధము (నేను అనుజ్ఞానము) వికసించును. ఏవిధముగా వికసించు నను ప్రశ్నము వేయకు. ముందుగా దాని నెఱుంగఁజూతము. ఓపిక పట్టి నాసౌందర్యలహర్యనువాదము ద్వితీయ ముద్రణమున తత్త్వవివరణము చూడు. కొంత తెలియును. ఇపుడు మీ సమక్షమున మాటాడుచున్నాను గనుక విను. అపరమభావ

మందు, అహంబోధము ఉబుకక మున్ను, దాని స్వరూపము అవాఙ్మానసగోచరము. 'నేను' అను మాటయే అహంబోధము. ఇదే బహుత్వసంకల్పమునకైన ప్రథమశక్తి (ఇచ్ఛ) స్పందనము, పుట్టినతోడనే అఘటనఘటనపటీయసి మహామాయ ప్రకట యగును. అదిగో — ఆ ప్రప్రథమమైన అహంబోధప్రకాశము మొదలుకొనియే, ఈపంచభూతములు, పాంచభౌతికపదార్థముల పర్యంతము, మఱి విరాడ్రూపబ్రహ్మాండపర్యంతముతోఁగూడ మహామాయాప్రకాశమగును. ఈమహామాయయే యెంతవఱకు స్థిరమై, స్పందనము లేనిదై, అనఁగా క్రియాశక్తిరహితమై యుండునో అంతదాఁక, పరమాత్మ—బ్రహ్మము—నిరంజనము, మున్నగు పదములతోఁ బ్రసిద్ధయగుచున్నది. ఎపుడు శక్తిరూప వికాసమారంభమగునో, యపుడే దాని పేరు మహామాయ యైనది. తొల్దొల్త నేయహంబోధము వికసింపఁజొచ్చెనో, ఆ 'నేను' మహాః — ఏకము. అపుడు రెండవ నేను లేదు. అద్వితీయమై యుండిన 'నేను' నకు, ఇచ్ఛ (సంకల్పము) ("సోఽకామయత! బహు స్యామ్" అని శ్రుతి) కలిగినంతనే, అది బహుత్వభావముతోఁ బ్రకటమగును. బహుత్వపుటాటలాడుకొనును; అదే జగన్నాటకము. ఆనందమే దాని స్వరూపము. కావున నీబహుత్వలీలలోపల సైతము, అఖండానందము అఖండితభావముతో నున్నది. ఈ బహుత్వమునకైన యిచ్ఛ పొడము చోటే మనస్సు. మనసు లేక సంకల్పము కాఁజాలదు గదా. ఈమనోమయియైన మన యమ్మ పూర్వపూర్వకల్పముల సృష్టిబీజముల నింతవఱక గుప్తముగాఁదనగర్భరూపముగా ధరించి యుంచి, యిపుడు మఱల వానిని ప్రసవించినది. ఈ బహుత్వసృష్టికి నిమిత్తోపాదానకారణములు రెండును అమ్మయే. ఆ బహుభావసంకల్పము చేసినది

"నేను". ఆనేనే బహుత్వమునొందెదనని సంకల్పించినది గాన నిమిత్తకారణమైనది. కాలముతోఁగూడిన సర్వశక్తిసంపన్న గావున నిపుడా 'నేను' కాముఁడు — కామేశ్వరుఁడు—కామేశ్వరి. ఆమెయే వాయువు, అగ్ని, జలము, స్థలము, సూర్యుఁడు, చంద్రుఁడు, అణువు, జీవాణువు, పరమాణువు, కీటము, పతంగము, పశువు, పాషాణవృక్ష, దేవతలు, ఓహో! ఇదేమి-అదేమి-ఇంకేమేమో యయినది. దిక్కులు, కాలము, కర్మము, ధర్మము, అధర్మము, కామము, క్రోధము, లోభము, మోహము మున్నగు శత్రువులు, దయాశౌచశాంత్యాదులైన మిత్రులు— ఒకటేమిటి—అన్నియుఁదానే యైపోయినది. అనంతకోటిబ్రహ్మాండాకారముతో ఆత్మప్రకాశము చేసికొన్నది. ఈ బ్రహ్మాండాకారసృష్టి కనువైన పంచభూతాదులైన సరకుగానుఁ దానే యైనది, కావున, ఉపాదానకారణమునుఁదానే యైనది. అనఁగా నన్నియుందానే యైపోవుటచే శవపర్యంతముఁగావలసి వచ్చినది. చైతన్యమే దాని స్వరూపము. అంతే గాక, ఆనందపరిణము చేతను, స్నేహము మిగుల నిండి యుబుకుటచే జడపర్యంతముం గావలసి వచ్చినది. ఆ తానే 'నేను'. ఈకారణముచే దాని కల్పితమైన అణుపరమాణువుల పటికు 'నేను' అనెడి జ్ఞానముతోనే మెలఁగుచున్నది. గాన, అది సముద్రమువలెనున్న "నేను". ఈజీవజగత్తు దానియందలి తరగలవలెనున్న 'నేను'.

ఒక లాంతరు, ఏడురంగుల యద్దములతో నమర్పఁబడి యున్నదనుకో. నడుమ నొక దీపపువత్తి వెల్గుచున్నది. ఈ యేడురంగుల యద్దపుముక్కలలోనుండి వెలుఁగొక్కటే, యేడు విధములుగాఁ బ్రకాశించుచున్నది. సరిగా నిదే విధముగాఁ బ్రత్యేక జీవుని యందును ఆ యొక్క (అద్వితీయమైన) అహంబోధమే

(నేను అను తెలివియే) చెప్పుచున్నది. వాస్తవముగా నది, ఒక్క నేనే యైనను, అనేకజీవులందనేకమైన నేనులుగాఁదోఁచు చున్నది.

ఇంకను, ఒకవిధముగాఁ బ్రయత్నింతము. సరే; ఈ బహుత్వ ముతోనున్న 'నేను' (శరీరములందు పలు నేనులు లేకున్నను అనేకభావములతోఁ బ్రకాశితముగునవి ఒక్క 'నేనే' సుమా) అను దానికి వ్యష్టిగాఁ బేరుపెట్టినపుడు "నేను—జీవుఁడు" అనియే కదా.

ఒక నిలువుటద్దము వేయి ముక్కలయినది. నిలువుటద్ద ముగా నున్నపుడును అందు నీరూపు గానవచ్చినది. ప్రత్యేకము లైన అద్దపు ముక్కలందును నీరూపు గానవచ్చినది. సమష్టి నిలువుటద్దములోని నీరూపే ఈశ్వరుఁడు. చిన్న యద్దపు ముక్క లోని నీరూపే జీవుఁడు. అనుకో.

ఆ (యద్వయ) సమష్టి నేను పేరే ఈశ్వరుఁడు. ఈశ్వరుఁ డెందుకనవలయును? ఈశ్వరుఁడనఁగా సర్వసమర్థుఁడు. ఈబహుత్వ సృష్టియు, దాని స్థితియు, ఆ నేనునందే జరుగుచున్నది. ఎపుడా నేను "మఱి నేను బహుత్వభావముతో వెలయ"నని యిచ్ఛింపం చునోయపుడే సృష్టి కైపోవును. ప్రలయమారంభమగును. ఇందుచే సృష్టిస్థితిప్రలయకర్త యీశ్వరుఁడు. ఈయంశమునకుఁ బూర్వమందుఁజెప్పబడిన పరమాత్మస్వరూపమునకే శక్తిరూప వికాసమందురు. ఆపరమాంశము పేరే శక్తిమంతుఁడు. అహం బోధతో నారంభించి, యనేకభావములనొంది ప్రకాశించువాఁడు. అతని జగద్ధారణప్రలయాదికార్యాంశమునే శక్తియనిరి. ఆశక్తియు శక్తిమంతుఁడును వాస్తవముచే నభిన్నులనియే యెన్నిసారులో నీకుఁజెప్పిన శ్రుతిసిద్ధాంతమునే మఱల నీకిపుడు తలంపించితిని. సూర్యుని ప్రకాశశక్తి యని, యగ్ని దాహకశక్తి యని,

యూరక యిట్లు నోరితోఁజెప్పికొందుము. చెప్పినట్లుగా సమష్టి యెన్నఁడును భేదానుభవమునకుఁదగియుండదు. వ్యష్టి శక్తి శక్తిమంతుల భేదము కేవలవాచికవిచారముతో సంబంధించినదే. 'రాహువుశిరస్సు' అన్నంతమాత్రాన రాహు శిరస్సులు వేర్వేఱు కానటులే, పరమాత్మయుఁడచ్ఛక్తియు నభిన్నులనియే మెఱింగి మఱువరానిది.

ఉండనీ — ఇపుడు మన యాలోచనములోఁదేలినది— 'నేను' అనుదానికి మూడు రూపములని కదా. ఒక నేను జీవుఁడు; ఒక నేను ఈశ్వరుఁడు; మూఁడవ నేను పరముఁడు (పరమ భావము). ఆ "నేను" కే "సః" యని పేరు. ఏమన నది కేవలమప్రత్యక్షము. మొదటి జీవుఁడు 'నేను' కు అహమ్ అని పేరు. ఆ 'సః' యు, ఈ "అహమ్ము" ను రెండునెపుడు ఏకమై పోవునో (అనఁగా, ఈ "అహమ్" తాను "సః" గాఁదెలిసికొని, ఆనిక్కపుఁదెల్వియందు నిల్చునో) అపుడు జీవుఁడు బ్రహ్మ స్వరూపమునఁబ్రకాశితుఁడగును. ఈ యైక్యము మూలముగానే సమాధి. సమాధియే 'అహమ్'ను 'సః'గాఁజేసివేయును. కావున సమాధి తనను సోఽహమ్ అనుచుఁబరిచితము చేసికొన్నది.

ఈవిధముగా మనము "సోఽహమ్"అను దానిని గూర్చి యెటులు తెలిసికొంటిమో యటులే యింకను మఱికొంత తెలిసి కొనఁదగి యున్నది. చూడు.

"నేను జీవుఁడను" అని నీవనుకొనుచున్నావే, యది వాస్తవమింతయును గాదు. నేనిచ్చిన లాంతరుదృష్టాంతమును స్మరించుకోఁగలవా?

"నేను ఒక జనమాత్రుఁడను." 'నేను' అనినచో ఈశ్వరుఁడనియు నర్థమగును. 'నేను' అన్నంత నీదేహామే యను

సజ్ఞానము జీవునందలి విశేషము; కార్యముచేతను సదియే. "సః" తోఁగూడ "అహమ్" చేరుట యున్నదే, పరముతో నీశ్వరుఁడు చేరుట యున్నచో సరిగా నుండును. ఇదిగో, సాధకా! చేరుట యన్నపుడు రెండు భిన్నవస్తువు లొకచోటఁగూడుకొనుట యని మాత్రము తలఁపవలదు. జీవభావముతోనైన యజ్ఞానముచేఁ బుట్టిన "నేను" ఈశ్వరభావముతోఁ బ్రకాశించు యథార్థమైన 'నేను' యొక్క లోతును దెలిసికొనఁగానే (లక్ష్యము తెలియఁగఁ గానే) జీవేశ్వరుల యేకత్వము సంభవించును. పిదప నీశ్వర భావముతో వెలయు 'నేను' పరమభావమునకుఁ గొంపోఁబడఁగానే పరమపురుషార్థము (మోక్షము) లభించును. జీవుఁడు పరమ భావముతో వెలయుచున్నంతనే మధ్యవర్తిస్వరూపమైన "ఈశ్వరుఁ డనెడి నేనును అతిక్రమించి కాఁజాలఁడు. జీవుఁడు తొలుత నీశ్వరుఁడు కావలయును. ఈశ్వరుఁడు పరమభావమును బొంద వలయును. ఇదే ముక్తి. ఇదె మూలతత్త్వము.

ఇందుచే మనమేమి తెలియఁగలిగితిమి, సరోజా! జీవునకు సాధ్యము ఈశ్వరుఁడనియు, పరమభావము సాధ్యము కాదని యును గదా. ఆపరమభావము సాధ్యసాధనాదిసర్వమునకు నతీ తము, కావున నుపాసనము సాధన మున్నంతవఱకు నా మధ్య వర్తి (ఈశ్వరుఁడు) యవస్థయందే సిద్ధమగుననియుఁగదా. జీవుఁడు ఎటులో ఈశ్వరరూపవిశిష్టుఁడు కాఁగలఁడేని వాస్తవముచే, అహంస్వరూపవస్తుసంధానము నొందును. జీవభావముతో, ప్రకాశించుచున్న "నేను" ప్రతిబింబమాత్రమే. కావుననే చండీ పాఠమందు "యా దేవీ సర్వభూతేషు ఛాయారూపేణ సంస్థితా। నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః" అని వర్ణింపఁ బడినది. యథార్థమైన "నేను" సృష్టిస్థితిప్రలయకర్త. సర్వజ్ఞము.

సర్వేశ్వరము. అపారకృపాసింధువు. స్వేచ్ఛామయము, నిగ్రహానుగ్రహసమర్థము. ఏకాంతస్వరూపము ఇదే అక్షరపురుషుఁడు. జీవుఁడనెడి 'నేను' క్షరపురుషుఁడు. కారణమేమందువా? అర్ధములో మఱుఁగుపడియున్న ప్రకాశస్వరూపమైన 'అహమ్' తొలఁగిపోయెనేని ఆ ప్రతిబింబరూపజీవుఁడుండఁజాలఁడు; గాన మున్ను చెప్పినట్లు 'నేను' అన్నది కేవలము ఒక్కటియే. మన తల్లి 'నేను' రూపమైన అహమ్మయిగా నున్నది. కావున నామె సర్వాంగములందును "నేను" (అహామ్) భాసించుచున్నది. ప్రత్యేక పరమాణువునందును, 'నేను, నేను' అనుచు వ్యక్తయగుచున్నది. ఏమహాన్—విరాట్—అయిన ఆ 'నేను' అనెడి సముద్రమునుండియే యీ చినచిన్న బుడగలు లేచుచున్నవో, ఆ 'నేను' యొక్క అనుసంధానమే సాధన యనఁబడును. (అనుసంధానమనఁగా విడువక వెదకుట, లేదా, దానిఁజేరఁబ్రయత్నించుటయన్నను దప్పులేదు). ఆ 'నేను' నందలి రుచికే భక్తి, ప్రేమ యని పేరు. ఆ 'నేను'ను దెలిసికొనుటకే జ్ఞానమని పేరు.

సాధకా! నీసాధన తత్త్వమయము కానన్నాళ్లు అనఁగా, ఆత్మానుసంధానయుక్తము కానన్నాళ్లును, నీరసముగా మెల్లమెల్లఁగా సాగును. అందుచేతనే ఆత్మసంవేదనమను గ్రంథమందు "పూజాధ్యానజపాదీని నామసంకీర్తనాని చ। అహందేవవియుక్తాని వికలాన్యాహ బ్రహ్మవిత్ ॥" పూజయే కానీ, ధ్యానమే కానీ, జపమే కానీ, నామసంకీర్తనము కానిమ్ము, నీవు చేయునది "నేను వేఱు, దేవుఁడు వేఱు" అను బుద్ధితో నయ్యెనేని, యీ నీచేష్టలన్నియు లోపసహితములే; పూర్ణములు కావు. అనఁగాఁ బూర్ణఫలదాయకములు కావు. అహందేవయుక్తమన నిదియే. 'నేనే' సాధ్యము, 'నేనే' పూజ్యము, 'నేనే' ఉపాస్యము.

ఎన్నాళ్లు, ఈ 'నేను'ను విడిచి సాధకుఁడు ముందంజ వేయుచున్నను, అతఁడు అన్నాళ్లు "నేను" పూజనే చేయుచున్నాఁడు. గాని యది విధిపూర్వకమైన పూజ కాదు. కావుననే శ్రీకృష్ణభగవానుఁడు గీతలో "యేఽప్యన్యదేవతా భక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః। తేఽపి మామేవ కౌంతేయ యజన్త్యవిధిపూర్వకమ్॥" "అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ" ఇత్యాదివాక్యము లన్నాఁడు.

ఇంతేల — సంధ్యానామకగాయత్రిని బ్రహ్మశక్తి నుపాసింపుఁడని యుపనయనసంస్కారము చేసి "న భిన్నాం ప్రతిపద్యేత గాయత్రీం బ్రహ్మణా సహ। అహం బ్రహ్మేత్యుపాసీత విధినా యేన కేనచిత్॥" గాయత్రిని జపధ్యానపూజా సంకీర్తనాదులచే నెట్లారాధించినను "అహం బ్రహ్మాస్మీతి" మహావాక్యార్థము భంగపడకుండునటులు (అహంకేవలయుక్తము కానటులు) యజింపుఁడనియే గదా వసిష్ఠభారద్వాజాదులు ద్విజబాలురకుపదేశించిరి. మఱియు "అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే। తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్" అనెడి కృష్ణభగవానుని ప్రతిజ్ఞావాక్యమందు "అనన్యాశ్చింతయంతః" అనునపుడు, "నాకంటె పరమాత్మ వేఱు" అనక చింతించు వారే నిత్యయోగులని కదా యర్థము.

"ఈ 'నేనే' ఈశ్వరుఁడను; సర్వయజ్ఞముల భోక్తను నేనే; ప్రభువను నేనే; యెవ్వఁడేమాత్రపుఁగర్మమాచరించినను దాని భోగించువాఁడను నేను. జీవుఁడా! యెందాఁక నన్నెఱుంగవో, నన్నాదరింపవో అందాఁక నీవు జన్మమృత్యుదుఃఖయాతన యనెడి తిరుగటిలోఁబడి పిండియై పోవుచుందువు. నేను సర్వజీవుల హృద

యమందును బ్రాహ్మరూపముతోనున్నాడు. నన్నెవఁడు తెలియు లేఁడో, వాని మించిన దురాచారి మానవకోటిలో మఱి లేఁడు. ఇంతకంటెను దురాచారి వ్యక్తియు నన్ను భజింపఁగల్గుచున్నాఁడు. వాని నేను రక్షింతును. ఈ నేనే వైష్ణవుల రాధాకృష్ణుఁడను; శైవుల శివుఁడను; శాక్తుల శక్తిని; గాణాపత్యుల గణపతిని; సౌరుల సూర్యుఁడను; ఈ నేనే సాకారమైన విశ్వరూపము. భక్తభక్తి విశేషమును బట్టి విశిష్టరూపముతో నేనే యావిర్భ వింతును. ఈ నేనే రూపాతీతము; నిరంజనము. ఎందాఁక జీవుఁడు 'నేను జీవుఁడ'నను తెల్వితోనే యుండి, 'ఈశ్వరోఽహమ్' అను దానిని పృథగ్భావముతో నుపాసించునో అంతదాఁక నన్ను వాఁడు పొంద లేఁడు. పొందునుపాయమును మఱి లేదు." ఇవి భగవంతుని మాటలు; అమ్మ మాటలు.

సాధకా! "నేను జీవుఁడను గాను" అను మాటనే తలంచుకొనుచుండుము. "నేను జీవుఁడ"నని యభిమానముతో నుబ్బుచుండు వాని యందలి నేను అమ్మ, యైపోవును. అమ్మ యెన్నఁడును జీవుని విడిచియుండఁబోదు. సాధకుఁడా! జన్మ జన్మాంతరములనుండియు 'నేను' (అమ్మ) జ్ఞానసారముగా హృదయమందుండి, అజ్ఞానసారముగా సర్వరూపముగానుండి నిను బోషించుచున్నది; ఆదరించుచున్నది. నెయ్యముతో నాశ్ర యమిచ్చి పెంపొందించుచున్నది.

ఇంతదాఁక నీవెఱుంగకున్నను హాని లేదు. ఇపుడు మను ష్యుఁడవైనావు. ఇపుడైనను నీయమ్మను నీవు గుర్తింపవా? మహాదుఃఖముతో నున్నానుచునూ! "అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్" (గీత. 9-11) మనుజు లారా! మీరు నన్ను మిపుల నవమానించుచున్నారు. మీరు

నన్నెంత తిరస్కారము చేయుదురో? మీరాకు నేనంత నష్టగానే (తెలియఁబడకే) యుందును. సిగ్గుతో మొగము దించుకొని ఊరక కన్నీరు నించుచు, కొమరకులారా! యనుచు మీ వెను వెనుకనే తిరుగుచున్నాను. మీరెపుడు నన్ను ప్రసాదింతురో, యెప్పుడు మాయమ్మా! యని నోరెత్తి పిలుతురో యని నపేక్షతో నున్నాను. మీరు నేఁడు "నాది, నాది" యనుచున్నారే — అభిమానరూపిణినైన నా నామమునే యభిమానముంచి మెలఁగుచున్నారనుకే కదా యది. "నాది" యను సంస్కృతమున 'మమ' — 'మీరు మమ' యన్నను అమ్మా! అమ్మా! యన్న పిలుపే యగును. (మమ కాళీ వసుధా చంద్రో లక్ష్మీరాత్మేతి గ్రబంధనే — తంత్రాభిధానము.) గాని నావంక నొక్కసారి చూచి మీనోరారఁబిలువుఁడు. కొమరకులారా! ఎంతకాలము శిశువులై యుందురు? నన్ను అమ్మా! యని పిలువుఁడు. నన్ను జేరుదురు.

అమ్మా! సరోజా! అహంతత్త్వము నెఱుంగుటకై యనేకవిధముల యాలోచనము చేసినంతమాత్రాన శ్రమలేదు. చీకాకులేదు ఈ యాయుమున నా శిష్యులయందొక యిరువురైనను నేను జెప్పిన సాధన చేయఁగల్గుదురేని, యీ గోపనీయములు ప్రకాశింపఁజేసిన శ్రమ కానరాదు.

అమ్మాయీ! ఇదిగో — యిది మఱువకుమా; 'సోఽహం' అగుటకుఁబైని జెప్పిన దానికంటె సహాయము మఱి లేదు. 'సోఽహం' సిద్ధింపదేని జననమరణప్రవాహమువలన మఱి తేలలేరు. మనము జీవభావముతో "నేను — నేను" అనుచున్నామే, యది వాస్తవికమైన 'నేను' కాదు. 'నేను' అనునదొక్కటే. భిన్న భిన్నోపాధులయందు భిన్న భిన్నముగాఁ బ్రతిధ్వనించుచు,

ఆయొక్క 'నేనే' దేవమనుష్యతిర్యగాద్యాకారములందు వెలయుచున్నది. ఆయేకమైన 'సోఽహమ్'నే శరణమొందుము. అదె అన్నా.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ |

సర్వరూపములందును, ఏ 'నేను' యొక్క ప్రతిబింబమును జూచుచున్నారో, ఆప్రతిబింబములను విడిచి, అన్నిటిలో ననుస్యూతమైన (సమముగా నల్లుకొనియున్న) ఆ 'నేను'నే సమాశ్రయింపుము.

అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః||"

(గీత. 18 _ 66)

నేను మిమ్ములను సర్వపాపములనుండి విడిపింతును. శాన్తిమయోదారము క్షేత్రమగు సోఽహంరాజ్యమందుఁజేర్తును; దుఃఖింపకుఁడు అను నీ గీతావచనముల్లేక పాపమ్ములివానిని యెవ్వరిలోఁజక్కగా ననుభూతమగునో, వారె నిజముగా నీభావముతోఁదల్లినైన నన్నె గురువుగా నెంచి యాదరించి, నాచరణములందె యాత్మార్పణము చేయుటకై శక్తివంచనము చేయక పాటుపడుదురో వారికొఱకే యీ వ్యాసము.

అమ్మా! సరోజా! ఇతి రెండు ముక్కలు. మఱువకు. సమాధిధర్మము ఆత్మానుసంధానము; మనోధర్మము చాంచల్యము. విశ్వవ్యాపిప్రేమమహాత్మదర్శనము దేని యుద్దేశ్యమో అదె సమాధి. పూర్తిగా మాతృభావమందు మునిఁగి పోక, దేహాత్మబోధ సడలిపోక యది యసంభవము. కన్నతల్లీ! సంసారము సముద్రము, బ్రహ్మము సముద్రము. ఈసముద్రమును దాటించి యాసముద్రమునఁజేర్చుటకైన తెప్ప 'సోఽహంభావసమాధియే.' ఆతెలివియు నొక సముద్రమే. అది పొందుటకైన సాధనప్రక్రియయు సముద్రమే. ఈ సముద్రవర్ణనము చేయ నాతరము కాదు.

సరోజా! కార్డుపై నీవు వ్రాసిన మూడు ముక్కలకే నీముద్దు చెల్లింపుట కింత గ్రంథము పెరిగినది. నా వ్రాతలోని ముడిమాటలు ఆచరణములో నుంచుకొమ్మా.

అమ్మా! అమ్మా! అమ్మా!

శ్రీ గురుః సర్వకారణభూతా శక్తిః (శ్రుతి.)

ఓమ్ తత్ సత్

ఇది

శ్రీకాళహస్తివాసి, హారితసగోత్రుండు, శ్రీ శ్రీయానందనాథాపర నామకుండు, ఈశ్వర సత్యనారాయణశర్మ వ్రాసిన సోఽహంభావ సమాధినిగూర్చిన వ్యాసము.



శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, చిత్తూరు. 11-10-1956.

ఓమ్

# శ్రీ మాత ప్రార్థన

('విజయానంద్' అను వర్ణమెట్టు)



పల్లవి॥ కామేశ్వరీ కాత్యాయనీ ॥కామే॥

అ. ప॥ సోమశేఖరురాణీ మానసీ

భ్రమరాంబ నాభ్రమలెల్లఁబాపు ॥కామే॥

చరణం॥ ఫాలలోచనీ పాలఁబడితి దేవి

పాలింపవే బాలత్రిపురసుందరీ

కలుషహారిణీ కమలలోచనీ

జాలమేలనమ్మా జనని సన్నుబ్రోవా ॥కామే॥

—:0:—

(కల్యాణి - ఆదితాళం)

ప॥ శ్రీ రాజరాజేశ్వరీ కృపాకరి ॥శ్రీ॥

అ. ప॥ సరోజనయనీ శర్వాణి వాణీ

నారాయణీ అంబా నాదస్వరూపిణీ ॥శ్రీ॥

చ॥ "ఐం" కారరూపివి అఖిలాత్మవాణివి

"క్లీం" కారమూర్తివి సకలార్థదాయివి

"సౌః" కారవ్యాపివి సకలాత్మవాసివి

ఓంకారశక్తివి హ్రీంకారదేవివి ॥శ్రీ॥

ఇట్లు,

శ్రీ మాతసేవకుడు

జి. ఆంజనేయశ్రేష్ఠి

366/11 బాణాలవీధి, చిత్తూరు.

# 555-పుత్రవతీహితోపదేశములు

ఈ గ్రంథము మీ గురువు, మీ కుటుంబవైద్యుఁడు, మీ మంత్రసాని.

**ఆయుర్వేదాచార్య, శివశ్రీ, ములుగు విశ్వేశ్వరశాస్త్రిగారు.**

... ... ... ఇది చదువనేర్చిన యిల్లాలికి నిత్యోపయోగి. ఇంట సిద్ధముగా నుండు వైద్యుఁడు. ఆడుబిడ్డ సమర్తాదినది మొదలు తాగన్న బిడ్డకు 5 ఏండ్లు వచ్చువఱకు తనను, సంతానమును గాపాడుకొను విధులను, అనగా రజస్వలానియమ, ప్రసూతితంత్ర, కౌమారభృత్యము లందలి విషయములతో, ఆయుర్వేదసమన్వయముగల శిష్టాచారములతో, అనుభూత సులభచికిత్సలతో నలరారు నిది ప్రతిగృహమునకు నలంకారము. 40 శీర్షికలతో నెన్నో యపూర్వవిషయములు గలది. ... ...

**డా॥ ఎమ్. వి. సూర్యప్రకాశంపంతులు, (సివిల్ అసిస్టంట్ సర్జన్, గ॥ హాస్పిటల్, చిత్తూరు.**

... ... ... గృహస్థులు తమ గృహమందు నిత్య పారాయణము చేయఁదగిన గ్రంథము. సత్సంతతి నుత్పాదించు మార్గములు, దాని రక్షణమున కగు విధులు, ఆయుర్వేదసమన్వయముగల శిష్టాచారములు, సులభచికిత్సలు వెలయునిది గృహస్థులకు మాటిమాటికి ఆసుపత్రులకు పరుగెత్తు పని యెంతో తగ్గించి సుఖమిచ్చును. ... ... ...

**విదుషీమణి శ్రీ బుఱ్ఱా సూరమాంబ.**

అత్తింటికాపురమునకుఁ బోవు ఆడుబడుచు ఈ గ్రంథముతో బోయినచో తనకాపురము సుఖకరముగా సాగును. తనకు, తన సంతానమునకు మాటిమాటికి గలుగు వ్యాధులకై తానే సులభచికిత్సలను జేసికొని గట్టెక్క-గలుగును. సామాన్య స్త్రీవ్యాధులకు, శిశువ్యాధులకు నిదానసులభచికిత్సలే గాక అపూర్వ విషయము లెన్నో యిందున్నవి. ... ... ...

# శ్రీ శ్రియానందనాథుల కృతులు

## వెలువడనున్నవి

1. సత్య — నారాయణ — శర్మ — సాధనము.
2. శ్రీ విద్యాంధ్రభాష్యము.
3. శ్రీ దుర్గాసప్తశతీసర్వస్వవివరణము.
4. శ్రీసిద్ధాన్తశిఖామణిసమగ్రవివరణము. (వీరశైవాద్వైత గ్రంథము.)
5. హ్రీంకార శతకము.

## వెలువడినవి

1. సౌందర్యలహరి — పద్యానువాదము — సవివరణము.
2. బాలాంబికానుతిశతకము.
3. భీమేశ్వరనుతి (శివాష్టోత్తరశతనామ పరమార్థము)
4. వాసవికన్యకాంబాస్తుతి.
5. శ్రీసూక్తరహస్యార్థము.

## వెలువడి నిండుకొన్నవి

1. శ్రీ (కాళిదాసకృత) దేవీపంచస్తవ్యనువాదము.
2. మహాసారమంతపాఠానువాదము.
3. అమ్మతో ముచ్చటలు.
4. అరసవల్లి సూర్యక్షేత్రమాహాత్మ్యము.
5. జావకీశ్వర శతకము.

